గానే కనుపిస్తున్నాయి. పాశ్చాత్యదేశాల్లో సాధారణంగా నగిటుమీద నాటకానికి మూడుకంటే ఎక్కువ అంకాలు వుండవు. ఎక్కువకుఎక్కువ రంగస్థల పరివర్తనాలుకూడా మూడుసార్లకంటే ఎక్కువ వుండవు. మూడుగంటల కాలావధి గల సాయంతన ప్రదర్శనంలో ప్రేక్షకులు దాహం గీహం తీర్చుకోడానికి గాను ప్రాయశః పది నిముషాల చొప్పున రెండు విశ్రాంతి సమయా లుంటవి. ఆ సమయాల్లో ప్రదర్శనకర్తకు సెట్టింగులను మార్చుకోడానికి అవకాశం బాగా దొరుకుతుంది. కాని భారతీయనాటకంలో రంగాలు అనేకం. వాస్తవికాత్మకంగా వాటిని ప్రదర్శించాలంటే రంగపరివర్తనకే ఎన్నోగంటలు పడుతవి. గ్రంథకర్తలు తమ నాటకాలకు పృష్ఠభూమికగా రంగప్రసాధన మొకటి వున్నదని మనసులో పెట్టుకొని, సాయంతన ప్రదర్శనాల్లో రంగపరివర్తనమే ఒక ప్రధానవిషయం కాకుండు లాగున నాటకములను రచించేమెడల వారు ప్రదర్శకుల కెంతో సహాయపడినవా రవుతారు.

గ్రంథకర్తలు ప్రదర్శనకర్తలమీద ఇన్ని బాధ్యతలు పడవేసేమెడల ముందుముందు నాటకములను సాంకేతికపద్ధతుల (Symbolistic lines) మీదనేగాని వాస్తవిక (Realistic) పద్ధతులమీద ప్రదర్శింపగలుగుటకు వీలేఉండదు.

### మూడు పరిమాణాల రంగప్రసాధనలు

వెనకాల బోలెడన్ని కర్టెను లుండడానికంటే మూడు పరిమాణాలు గల ఒకే ఒకవృక్షం అడవినిగాని, పొదరింటినిగాని, తోటనుగాని తలపింపజేయజాలుతుందనీ, ఒక్క స్తంభం ప్రాసాదానికి సరిపోతుందనీ నా యభిప్రాయం. కాని ఈలాంటి భ్రమ కల్పించడానికి వెలుతురును సమకూర్చడంలో అపరిమితమైన చాకచక్యమూ, నేర్పరితనమూ ఉండాలి. అత్యంతమైన రంగస్థలప్రసాధననైపుణ్యముకూడా వుండాలని దీని తాత్పర్యం. నేర్పరులైన ప్రసాధకులు అనేకచోట్ల లభించగలరనేదీ వొక అదృష్టవిషయం; ప్రదర్శకుడు వొక్కపర్యాయం తన వుద్దేశాలను వారికి తెలిపరిచాకంటే ఇక అతని యభిలషితాలు నెరవేరడంలో కష్టమేమీ వుండదు.

### అవకతవక నాట్య, సంగీత మిశ్రణం

ఈ సందర్భంలో ఒకమాట చెప్పవలసివుంది. వినోద ప్రదర్శన విషయంలో ఇది అసలు నాటకమనీ, ఇది గేయాత్మకమైన కామెడీ యనీ, ఇది ఆపెరా యనీ, ఇది నాట్యగాన మనీ, ఇది రివ్యూ అనీ, ఇది వైవిధ్యవినోదప్రదర్శనమనీ స్పష్టంగా విభజించి కనుగొనుకోగలిగినంత స్థితిలోకి మన మింకా రాలేదు. నాట్యసంగీతసంమిశ్రణమైన నాటకమే మనకు ఆఖరు గతి. (సంగీతనాట్యసంమిళితమైన నాటక మనే మంచి తరిఫీయతులేని పందెపుగుర్రంమీదనే మనం ఆఖరుకు సవారీచేయవలసింది). ఈ సంమిశ్రణం సముచితవిభాగాల్లో కలిసిందనీ, దీనివల్ల కలిగే ఫలితం అనారోగ్యకరమైనది కాదనీమాత్రం మన మెక్కువకుఎక్కువ ఆశించగలిగింది. సంగీతం లేకుండా, నాట్యంయొక్క కలగలుపు లేకుండా ప్రేక్షకులు మెచ్చుకోగలిగిన నాటకాన్ని ముందే మేధావియైనా, ఏనాటైనా వ్రాయవచ్చు. కాని ఆ సుదినం ఇంకా చాలాదూరంలోనే వున్నట్లు కనబడుతుంది.

ఈ సంమిశ్రణంలోని అవకతవక కలగలుపే మనలను నేడు బాధించేది. తరుచుగా సంగీతం అపరిమితంగా, మాత్రకు మించి వుండడమూ, కాని సమయంలో నాట్యప్రసంగమూ! ప్రాయః ఈస్థితిగతులలో అభివృద్ధిగావించుకోడానికి ప్రయత్నించవచ్చు. ఒక ఇంగితజ్ఞుడైన ప్రదర్శకుడే ఇందులకు కావలసింది.

### స్త్రీపాత్రలు - స్త్రీలు

కడచిన పదిసంవత్సరాల్లోనూ స్త్రీపాత్రలనిమిత్తం పురుషులకుబదులు స్త్రీలనే నియోగించుకోవలె ననే వొక విస్పష్టమైన సంప్రదాయం ఏర్పడింది. అంతకు పూర్వం ఎన్నిసంవత్సరాలుగానో స్త్రీలు స్త్రీపాత్రలను ధరిస్తూఉన్నా రనడం వాస్తవమే. కాని అంతకంటే ఎక్కువ తరుచుగా పురుషులే స్త్రీపాత్రలను ధరిస్తూ వచ్చారు. సినీమామెడల గల జనాదరణ ఆ అభిరుచిని మార్చింది. ప్రేక్షకులు స్త్రీపాత్రలకుగాను పురుషులను అంగీకరించడంలో విముఖత్వం వహించారు.

### రంగస్థలంమీద నటీమణుల వెనుకంజ

కాబట్టి నిరుద్యోగి తారకలు పెద్దపెద్ద తారలలాగు రంగస్థలంమీద సులభోద్యోగాలను సంపాదింపగలిగారు. కాని సినీమాలోకంకంటే నాటకరంగంమీద అభినయించడం దురదృష్టవశాత్తుగా కష్టతరమవుతుంది. రంగస్థలంమీద నటించే నటీమణులందరికీ-ఎవరికో కొందరికి తప్ప-వారికి కావలసిన కళాసామర్థ్యాలు లేవనీ, వారి జ్ఞాపకశక్తి దుష్టమైనదనీ, వారు వారి అంతర్గతభావాలను ప్రకటించలేరనీ, వారి ఉచ్చారణము అశుద్ధమనీ, వారి సంగీతనైపుణ్యాలు ఉపేక్షింపతగినవనీ ప్రేక్షకజనం కనిపెట్టలేకపోరు. స్వాంగధారణం ఆకర్షణీయంగా చేసుకొన్నంతమాత్రంచేత ఈలోపాలు కూడిరావు. కాబట్టే స్థానం, తోట వెంకటేశ్వరరావులవంటి సమర్థులైన పురుషులు ఇంకా స్త్రీపాత్రధారణంలో జనాదరణ పొందుతున్నా రనడం ఆశ్చర్యపడదగిన విషయం కాదు.

### అభివృద్ధికి రెండుమార్గాలు

ఈవిషయంలో అభివృద్ధిపరుచుకోడానికి రెండు మార్గాలు కలవని నానమ్మకం. సామర్థ్యం గుప్తంగా ఎక్కడుందో గాలించండి. దాన్ని ప్రోత్సాహపరచండి, రంగస్థల ప్రఖ్యాతియందు గల విలువను నటీశిక్షయందు జ్ఞానశక్తిగల ఏయువతికైనా శిక్షణ గరపండి కాని ఈవిధానంవల్ల ఫలితం కలుగుతుం దని నే నంతగా ఆశించను. లేక దొరకిన సామగ్రినే అత్యుత్తమంగా పరిణమింపచేయడానికి అనంతమైన సహనంతో ప్రయత్నించండి. ఇది సాధ్యమని నాకు తెలుసు. నటీనిర్మాణమంటు కొన్ని సంవత్సరాలు గడపినతరువాత మరొకరు వచ్చి ఆమెను తీసుకుపోతా రనీ, ఆమె తప్పనిసరిగా వెండితెరవైపునకే మొగ్గుతుందనీకూడా నాకు తెలుసు. కాని ఇందువల్ల నిరుత్సాహపడ నవసరం లేదు. ఒక్క కళావతినైనా సృష్టింపగలిగా మని తృప్తిపడవచ్చు.

### నాటకాలమీద సినిమాల పోటీ

రంగస్థలంమీద పైకివచ్చిన వ్యక్తిసామర్థ్యం సినీమా పరిశ్రమకు మళ్లుతుం దనుకోవలసిందే. అది సహజమే. సినీమాకంపెనీలు పెద్ద పెద్ద జీతాలిస్తవి. నాటకరంగంమీది పనితో పోల్చుకొనేయెడల సినీమాపని అంతకంటే ఎంతో సులభమైంది. కళాసేవకులు నాటకరంగంమీద చూపించవలసినంత ధ్యానమూ, వ్యక్తిత్వమూ సినీమాలో చూపించనక్కరలేదు. సినీమాఅభినయం జ్ఞాపకశక్తి కొంతమాత్రమూ ధక్కానివ్వదు. సినిమాలో ఒకవేళ అభినయం పాడైనయెడల మరికొన్ని అడుగుల సెల్యులాయిడ్ ఖర్చుపెట్టుకుంటే మళ్లీ బాగవుతుంది. కాని నాటకంలో అభినయం రవంత పాడైతే చాలు నాటకమంతా పాడవుతుంది. కాబట్టే నాటకంకంటే సినీమాయే ఎక్కువ లాభకరమైందీ, సులభమైందీ అని భావిస్తూంటారు కళాసేవకులు.

### లాభసాటి మార్గం

కాని ఫిలింరంగాభినయంలో పనిలేని దీర్ఘావకాశాలెన్నో దొరుకుతుంటాయి. ఆసమయాల్లో కళాసేవకులు నాటకప్రదర్శనాలకు తోడ్పడవచ్చు. అందువల్ల ప్రేక్షకులను స్వయంగా కలుసుకోడానికి వారికి అవకాశం దొరుకుతుంది. కళాసేవకులు సమర్థులే యైనయెడల వారి జనాదరణ మరింత ఎక్కువవుతుంది. ప్రస్తుతం ముడిఫిలిము (Raw film) లో కలిగిన కొరతవల్ల సినిమాపరిశ్రమలోకూడా అంత ఎక్కువ పని వుండదు; పరిమితంగానే వుంటుంది. ఈసమయంలో కళాసేవకులు ఎక్కువ పరిశ్రమ చేయవలసిన రంగస్థలంమీద శిక్షణ పొందారంటే అది వారి కెంతో లాభదాయకమవుతుంది. సినిమాపరిశ్రమా, నాటకప్రదర్శనాలూ పరస్పర సహకారం చేసుకొని వర్తించేయెడల కళాసేవలో ఎంతో సాధించవచ్చు నని నానమ్మకం.

### నాటకశాలలకే గతిలేదు

ఈ సందర్భంలో నాటకాన్ని సినీమా ఎట్లా లోగొన్నదీ చూస్తే వినోదం కలుగుతుంది. 15 ఏండ్ల క్రిందట ఆంధ్రదేశంలో నాటకశాల లేని పట్నంగాని, పెద్దనగరంగాని కనిపించేదే కాదు. ఈనాడు నాటకాలాడాలంటే నాటకశాలగల పట్నం ఒక్కటైనా వుంటుందో వుండదో! ఏదైనా నాటక మాడుకోవలెనంటే ఇప్పుడు మనకు దొరికేది సినీమాశాలే. దాన్నే తాత్కాలికంగా నాటకశాలక్రింద మార్చుకొని ఉపయోగించుకోవాలి. సినీమాహాలులో ప్రేక్షకులు కూచునే ఏర్పాట్లూ, ప్రసాధనపరికరాలూ, రంగస్థలపరిమాణ

# కోహినూర్ ఆభరణములు



కోహినూర్ ఆభరణములు హిందూదేశమంతటను అన్నిషాపులలో దొరకును. పని, మెరుగు, రంగునందు బంగారపు వస్తువులను మించియుండి యిచ్చిన గ్యారంటీ కాలమువరకు రంగుపోక నిలచియుండును. గిల్టువస్తువులను రోల్డుగోల్డు వస్తువులని అమ్ము కంపెనీల మాటలనుగాని వ్రాతలనుగాని చూచి మోసపోకుడు. ప్రతి కోహినూర్ ఆభరణము మీద కోహినూర్ అని యింగ్లీషులో ముద్రించి యుండును.

వివరములకు వ్రాయుడు.

**కోహినూర్ రోల్డుగోల్డు కంపెనీ,**
చిలకలపూడి.

---

## క్రౌషా

ఉపయోగించి **అన్ని దగ్గులను** నివారించుకొనుడు

దగ్గులకు అత్యుత్తమమైనది. పెద్దలు పిల్లలు అందరు

40 మాత్రలపెట్టె 1-2-0
శాంపిల్ పాకెట్ 0-1-0

నిర్భయముగా వాడవచ్చును

మలేకెమికో. బెజవాడ.
మద్రాస్ ¾, అరుణాచలాచారివీధి, త్రిప్లికేన్.

స్టాకిస్టు, ట్రావెలింగు ఏజెంట్లు కావలెను.

---

## మైత్రే

ఉపయోగించి **మలేరియాను** పోగొట్టుకొనుడు

కొయినైన్ కలియని గ్యారంటీ మందు

40 ఏండ్లనుండి ప్రసిద్ధిగాంచినది. ఒక్కమోతాదుకే గుణము.

శాంపిల్ పాకెట్ 0-2-0
40 మాత్రలపెట్టె 1-8-0

మలేకెమికో. బెజవాడ
మద్రాస్ ¾, అరుణాచలాచారివీధి, త్రిప్లికేన్.

స్టాకిస్టు ట్రావెలింగు ఏజెంట్లు కావలెను

---

# విజయ సింధూరము

(రిజిష్టర్డు)

స్త్రీల హిష్టీరియావ్యాధిని, కుసుమవ్యాధులను, నడుమునొప్పి, అరికాళ్లు, అరిచేతులు మంటలు, కాళ్లులాగుట, నరముల బలహీనత, ఋతుదోషములను పోగొట్టి, మిక్కిలి బలమును, సత్సంతానమును కలిగించును. కేటలాగు, సలహా ఉచితము.

సమస్త ఆయుర్వేద ఔషధములు దొరుకును.

**శ్రీ కృష్ణ ఆయుర్వేద ఫార్మసీ,**
ఏలూరు.

మా నాటకప్రదర్శనాని కెంతమాత్రమూ తగినవిగా వుండవు. అట్టి నాటకశాలయొక్క అద్దెకూడా అపరిమితంగా పెరిగిపోయింది. గుంటూరువంటి ఒక పెద్ద పట్నంలో చూసుకోండి! ఒక్క ప్రదర్శనానికి చెల్లించవలసిన అద్దె రు 135 మొదలు రు 200 వరకూ ఉంటుంది. హాలు ఏనాడు దొరకగలదో అదీ నిశ్చయం లేదు. మనం నాటకం ఏర్పరుచుకొనేనాడు దొరుకుతుందో దొరకదో!

బహిరంగరంగస్థలాల్లో బయలాటలే గతి

నాటకా లాడుకోవడానికి ఒక నాటకశాలను నిర్మించుకొని భరించవలెనంటే అది అమితవ్యయదాయకం. అందువల్ల కలిగే లాభమా, అస్థిరమైనది—ఏ వ్యాపారస్థుడినైనా ఆకర్షిస్తుం దనటానికి. ఈ తంటాల నుంచి బయటపడవలెనంటే అనావృతబహిరంగశాలలకే (బయలాటలు) మళ్లాలి. గతసంవత్సరం నవంబరు మాసంలో మేము ఆంధ్రయూనివర్సిటీలో ఈవిధానాన్ని ప్రయోగించిచూశాం. మా నాటకశాలవల్ల మాకైన ఖర్చు చాలా స్వల్పం. అతినిపుణులైన రంగప్రసాధకుల సహకారంతో నాటకాలను ప్రేక్షకులకు ప్రసాదింపగలిగాం. ప్రేక్షకు లొక్కొక్కమారు అయిదువేల మందికంటేగూడా మించుతూవచ్చారు. ఈనాటకాలను ప్రదర్శించినవిధానమూ, ప్రేక్షకులు కూచోడానికి చేసిన ఏర్పాటూ ప్రతివాడూ చూడగలిగేలాగూ, వినగలిగేలాగూ చేయబడినవి. ప్రేక్షకు లీ నూతనోద్దేశాలతో పరిచయము కలిగియున్నందున వారూ మాకు చాలావరకు తోడ్పడిరని చెప్పకోవడం ముదావహమైన విషయం. కొద్దిలో ఈలాటి ప్రయోగాలు ఏలూరు, విశాఖపట్నాలలోగూడా జరిగాయని విన్నాను. సుడిగాలీ, వానావంగ డూ ఏమీ లేకుండా వుంటే అనావృతనాటకశాలలే ఈ దేశానికి తగినవని నా అభిప్రాయం. సముచితమైన ఏర్పాట్లు చేయబడేనెడల ఆవృతనాటకశాలలకంటే అనావృతాలే అధికసౌఖ్యదాయకము లవుత వనుకొంటాను.

నాటకరంగం కలకాలమూ రిక్రూటింగు క్షేత్రంగా ఉండవలసిందేనా?

ఇంకా ఎంతో కాలంవరకూ మన నాటకరంగం అమెచూరుపద్ధతులమీదనే నడుస్తూవుంటుందనీ, సినీమాపరిశ్రమకు పాత్రలను తరీఖీదుచేసి భర్తీచేయుటకు రిక్రూటింగు క్షేత్రంగా ఉండగలదనీ నాకు తడుతూ వుంది. కాని ఇందువల్ల మనం ధైర్యం కోలుపోరాదు. క్రొత్త ప్రయోగాలు (Experiments) జనుల అభిరుచిని అభివృద్ధిపరచవచ్చు. ప్రదర్శనపుఖర్చును తగ్గించే అనావృతనాటకశాల మన ప్రయోగాలు సాధ్యములయే లాగు చేస్తుంది. అభివృద్ధిపొందిన నాటకరచన, సంకేతాత్మకములైన సెట్టింగులు, జాగ్రత్తతోకూడిన స్వాంగధారణం, ఉత్సాహవంతులైన నటులు, అనావృతనాటకశాలలు, ఇంగితజ్ఞులు మేధావంతులు నగు సదస్యులు-ఇత్యాదులతో ప్రస్తుతకాలపు రంగస్థలాన్ని ఎంతైనా అభివృద్ధి పొందించగలుగుతాము.



# హే భగవన్!

శ్రీ కల్లూరి అహోబల
రావు



సీ. అంతరాళంబెల్ల నావరించిన నిన్ను
దేవాలయమున బంధించు టేల?
పరిశుభ్రగాత్రుఁడై వరలుచుండెడి నిన్ను
జలకంబులాడించు తలఁపులేల?
ప్రకృతిసంపదలచే రమణీయుఁడగు నిన్ను
శృంగారమును జేయు చింత లేల?
విరుల సౌరభముచేఁ బరిమళించెడి నిన్ను
చెలువుపుష్పములఁ బూజించు టేల?
గీ. ఆఁకలిఁ ద్యజించియున్న నీ యాత్మ కరయ
షడ్రసోపేతభోజనసమితి యేల?
నిత్యపరిపూర్ణ! దురితరాహిత్యహృదయ!
భక్తమందార! నీ కిదే వందనంబు!

సీ. పున్నమజాబిల్లి మురువుమర్మంబుల
యంతరార్థంబు నొక్కింతఁ దెలిసి
రిక్కల మిణుకులో నిక్కయాడెడి యాట
వెలది యొయ్యారంపు తళుకు లరసి
'కొక్కొరోకో'యను కోడికూఁతఁ జెలంగు
హెచ్చరికనినాద ముచ్చరించి
చివురుజొంపాలలోఁ జెలువారు సౌహార్ద్ర
తత్త్వసారము నిండుతమిని గ్రోలి
గీ. బాలపసిపాపముసినవ్వుపస యెఱింగి
విరుల నెత్తావిసొంపుసంబరము లరసి
నిన్నుఁ జింతించువాఁడె సంపన్నుఁ డరయ
భక్తమందార! నీ కిదే వందనంబు!

సీ. శిలయందు వజ్రంబు మొలిపించి నీదివ్య
శక్తిస్వరూపంబు చాటినావు
నారికేళఫలంబునందు నీరము పోసి
నీరహస్యంబు వర్ణించినావు
ఫణిఫణాగ్రమునందు భవ్యమాణిక్యంబు
చిత్రించి నీగుట్టు చెప్పినావు
అండంబులోపల నడఁగించి పులుగు నీ
దివ్యమాహాత్మ్యంబు దెల్పినావు
గీ. చిత్రవర్ణంబు పూలకుఁ జేర్చినావు
కూర్చినాఁడవు ప్రకృతికి గొప్ప చెలువు
ప్రకృతిమధురస్వరంబులఁ బాడినావు
భక్తమందార! నీ కిదే వందనంబు!

# వారప్రవృత్తి

= శ్రీ చివుకుల వెంకటరమణశాస్త్రి =

ఆదివారము, సోమవారము, మంగళవారము, బుధవారము, గురువారము, శుక్రవారము, శనివారము అను నీయేడున్ను వరుసగా భారతదేశమందేగాక ఇతరదేశము లన్నిటిలోను ఆయా దేశభాషలలో ఎట్టి మార్పును లేక సృష్ట్యాదినుండి నేటివరకు అవిచ్ఛిన్నముగా సుప్రసిద్ధవ్యవహారమును గనుచున్నవి. ఈ క్రమము సమస్తభూమండలమందును ఎట్టి వ్యత్యాసమును పొందకుండుటను బట్టి ఈ క్రమమునకు పుష్కలమగు ఉపపత్తి అవశ్య ముండితీర వలయును. అద్దాని నీ చిన్నివ్యాసమున నాకు తోచినంతవరకు క్లుప్తముగా ప్రదర్శింతును. ఈవారములు 7 ఏల కావలెను, ఈ క్రమమే ఏల ఉండవలెను అనునది ముఖ్యవిమర్శనీయము.

ఈ 7 పేర్లలో ఒకభాగము ఆది, సోమ మొదలగు సంజ్ఞలును, రెండవది 'వారము' అను శబ్దమున్ను. అందలి రెండవ భాగము ఈ 7 లోను సమానముగా నుండి, మొదటి సంజ్ఞాభాగము మాత్రము మార్పుచెందుచున్నది. ఈ 7లో మొదటిదగు 'ఆది' తప్ప మిగిలిన 6 న్ను చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని అను గ్రహముల పేర్లుగా సుప్రసిద్ధముగా నున్నందునను, జ్యోతిశ్శాస్త్రమందు కక్ష్యాక్రమముచే చంద్ర, బుధ, శుక్ర, రవి, కుజ, గురు, శని లను ఏడుగ్రహము లని చెప్పబడియుండుటచేతను పరిశేష న్యాయముచే ఆదివార మన రవివార మని పర్యవసన్నమగుచున్నది. అందువల్లనే మన దేశములో బాలురకుసయితము ఆదివారాదులకు రవ్యాదిగ్రహము లధిపతులని బోధింపబడుచున్నది. ఇంగ్లీషు భాషలోను, తదితరభాషలన్నిటిలోనుగూడ రవ్యాదిగ్రహములకు ఆయా భాషలలోని పేర్లను వారమునకు పొందికచేసి వాడబడుటచే యావద్భూమండలమందునుగూడ గ్రహములకు, నీవారములకు సంబంధము నంద రంగీకరించి వ్యవహరించుచున్నట్లు అప్రతిహతముగా చెప్పనగును. ఇక, నీ యేడింటికి సాధారణమగు 'వార' శబ్దార్థము నొకింత విచారింతము. "సూర్యాదివారము, తడవ-రేక పర్యాయము, సమూహము, వాకిలి, తృణము, కుబ్జవృక్షము, శివుడు, గుఱ్ఱము" మొదలగు అర్థములు వారశబ్దమున కున్నట్లు నిఘంటువులవల్ల తెలియుచున్నది. ఇందు మొదటిదగు 'సూర్యాదివారము' అనునది వారశబ్దార్థముగా నిఘంటువులు చెప్పుటవల్ల నీ వారశబ్ద మొక పారిభాషికపద మని తెల్లమగుచున్నది. లోకమున 'వృద్ధి'శబ్దము అభివృద్ధి, వడ్డీ మొదలగు అర్థములను బోధించుచున్నను "వృద్ధిరాదైచ్" అను పాణినిసూత్రమునుబట్టి ఎట్లు వైయాకరణులు వృద్ధిశబ్దమున కొక పారిభాషికార్థమును చెప్పుచున్నారో, అట్లే ఈవారశబ్దముగూడ పారిభాషిక మనినపుడు, వారశబ్దపూర్వోచ్చరితములగు రవ్యాదిశబ్దముల ననుసరించి, తద్విషయబోధకమగు జ్యోతిశ్శాస్త్రపరిభాష ననుసరించి యీవారశబ్దార్థము నిరూపింపబడుట సమంజసము.

మన కగోచరమగు విషయమును మనకు బోధించుటకొరకే శాస్త్ర మేర్పడినది. శాస్త్ర మనగా శాసనము చేయునది. ప్రత్యక్షముగా ఆయా ఇంద్రియములతో ఆయా విషయములను కనుగొనుట, అగుపడునట్టి ఒక వస్తువునుంచి అగపడని వస్త్వంతరము నూహించుట మొదలగు లోకసిద్ధమగు సమస్త ఉపాయములచేతను ఏవిషయము మనకు బోధపడదో అట్టి విషయమును బోధించునది శాస్త్రము. అనగా ఇహలోక, పరలోకములందు మనుజునకు స్వభావముచే గల్గు సుఖప్రాప్తి, దుఃఖనివృత్తి యను కోర్కెలను సిద్ధింపజేయుటకు అనేక ఉపాయములను బోధించి మనలను శాసించుటచే నద్దానికి శాస్త్రమని పేరు గలిగియున్నది.

ఈశాస్త్ర మన వేదము, వేదాంగములుమాత్రమే. వేదాంగములలో నొకటగు జ్యోతిశ్శాస్త్రము "ఒకపర్యాయము తూర్పున రవి ఉదయించుటతో నుపలక్షితమగు కాలముగాన వారము" అని నిర్వచించినది. అనగా సూర్యోదయమునుండి తిరిగి సూర్యోదయమువరకు గల కాలము 'వార' మను పరిభాషతో చెప్పబడినది. ఈలక్షణములో సూర్యోదయముతో నుపలక్షితకాలము నేల వారముగా పరిగ్రహింపవలెను? చంద్రోదయముతో నుపలక్షిత కాలము నేల గ్రహింపరాదు? ఇట్లే కుజాదిగ్రహములలో ఒక్కొక్క దానితో నుపలక్షితమగు కాలము నేల గ్రహింపరాదు? అటులనే ఒక నక్షత్రోదయముతో నుపలక్షితకాలము నేల గ్రహింపరాదు? వీటిలో దేనినైనను గ్రహింపనగునా? అటులైనచో నివి యన్నియు సమానకాలము లగునా? సమానములు కానిచో దేనిని గ్రహించి దేనిని పరిత్యజింపవలయును? అట్లొకదానిని పరిగ్రహించుటకు, మిగిలినవాటిని పరిత్యజించుటకు కారణము లెవ్వి? ఈమొదలగు ప్రశ్నలు పరంపరగా పొడగట్టుటవలన వీటి సమాధానము కుదిరిన గాని ఈ'వార' శబ్దమునకు పారిభాషికమగు అర్థము బోధపడదు.

భూమిచుట్టును అనేకనక్షత్రములు, రవ్యాదిగ్రహములును తిరుగుచుండుట మనకు అనుభవములో నున్నది. అందొక కాల

ములో ఒక్కొక్క గ్రహముగాని, నక్షత్రముగాని తూర్పున ఉదయించుట, తిరిగి అదియే కొంతకాలమునకు నెత్తిపైకి తిన్నగా (Meridian) వచ్చుట, తిరిగి అదియే కొంతకాలమునకు పశ్చిమమున అస్తమించుట, తిరిగి ఉదయించుట మనము చూచుచుండుట వలన ఇవన్నియు ఇంచుమించు రోజు కొకమారు భూమిచుట్టు తిరుగుచున్నట్లు ఆబాలగోపాలము ప్రసిద్ధిగానున్నది.

ఇందు నక్షత్రములలో ఏఒక్కటి అయినను తూర్పున ఉదయించినదిమొదలు తిరుగ తూర్పున ఉదయించుటకు 60 ఘడియల కాలము పట్టును. కాని రవ్యాదిగ్రహములుమాత్రమట్లుగాక 60 ఘడియలకంటె కొంత హెచ్చుకాలమునకు తిరిగి తూర్పున ఉదయించుచున్నవి. ఈవిషయము మనకు మిగిలిన గ్రహములకంటె మిక్కిలి సులభముగా చంద్రోదయములవల్ల గ్రహింపగల్గుచున్నాము. ఈరోజు చంద్రోదయకాలముకంటె రేపటి చంద్రోదయకాలము సుమారు 2 ఘడియలు ఆలస్యముగా నుండుట సార్వజనీనము. దీనిని బట్టి గ్రహ, నక్షత్రముల కక్ష్యలు (Orbits) వర్తులాకారములని తేలుచున్నది. ఒక కుమ్మరిచక్రము వాని ప్రేరణచే పశ్చిమాభిముఖముగా తిరుగుచుండు ననుకొందము. అశ్వనీనక్షత్రమునందలి A అను ఒక స్థిరమగు చిహ్నము త్రిప్పువాని ముందుకు ఎన్నిపర్యాయములు వచ్చునో అన్నిపర్యాయములు ఆచక్రము తిరిగిన దందుము. ఇది ఒక్కొక్క చుట్టుకు 10 నిముషముల కాలము పట్టె ననుకొందము. ఈ చక్రముమీదనే తూర్పుకు నడచుచున్న ఒక పురుగు ఉండునట్లు ఉదాహరణ చూచినచో, ఆపురుగు సమముగా 10 నిముషముల కొకమారు త్రిప్పువాని ముందరకు రాక 11 లేక 12 నిముషముల కొకమారు త్రిప్పువాని ముందుకు వచ్చును. ఇట్లే A చిహ్నమువంటి స్థిరచిహ్నములగు అశ్వన్యాదినక్షత్రములతోను, తూర్పునకు తిరుగుచున్న పురుగులవంటి రవ్యాదిగ్రహములతోను గూడిన జ్యోతిశ్చక్రమును ప్రవహవాయువు (భూమికి చాలాఎత్తులో నుండి, కొన్ని శక్తివిశేషములు గల గాలి) అను కుమ్మరి నిరంతరము సమానవేగముతో సృష్ట్యాదినుండి లయపర్యంతము త్రిప్పుచుండును.

అందుచే అశ్వన్యాదినక్షత్రములు స్వతస్సిద్ధమగు ప్రాగ్గమనము లేక, కేవల ప్రవహవాయు ప్రేరణచేమాత్రము నిరంతరము పశ్చిమాభిముఖముగా తిరుగుచున్నవి కావుననే వాటి ఉదయము ఎల్లపుడు సమానముగా 60 ఘడియల కొకమారు అగుచుండును. దానికే నక్షత్రదినము (Sideral day) అని పేరు. కాని రవ్యాదిగ్రహములు ఈనక్షత్రములతోపాటు పశ్చిమాభిముఖముగా ప్రవహవాయుప్రేరణచే తిరుగుచూ, స్వశక్తి (Property of Matter) యనదగు అనిర్వచనీయమగు ఒకానొక సామర్థ్యముచే తూర్పునకు నడచుచున్నవి కావున వీటి ఉదయములో నుపలక్షితమగు వారము 60 ఘడియలకంటె హెచ్చుగా నుండును. పదార్థశక్తులు పరస్పర విలక్షణములుగాన, ఈగ్రహముల గమనముగూడ పరస్పర విలక్షణమున్న, ప్రతిక్షణవిలక్షణమున్ను నైయుండును. (Vide: Stewart's Light, Chap VI) ఈస్వశక్తికిన్ని, ఈ 'వార' అను పారిభాషికపదమునకును కొంత సంబంధమున్నట్లు ఊహింప వీలుగనుపించుచున్నది. కావుననే, రవిచంద్రులుతప్ప మిగిలిన 5 గ్రహములకు కొంత కాలము ఋజుగమనము (Direct Motion), మరికొంతకాలము వక్రగమనము (Retrograde Motion) నుండుట చూచుచున్నాము. వక్రగమన మనగా వర్తులాకారమార్గమందు ఒక ప్రధానాపేక్షతో (when compared with a main matter) వెనుకకు నడచునట్లు భాసించుటయేగాని వాస్తవముగా వెనుకకు పోవుట కాదని ఈ క్రింది వుదాహరణవల్ల గ్రహింపవచ్చును.

A, B, C, D, E అనువారు ఐదుగురు ఒక ఫర్లాంగు చుట్టుకొలత గల గుండ్రని క్షేత్రముచుట్టు తిరుగుటకు ఒక నిర్దిష్ట ప్రారంభబిందువునుండి ఒకేసమయమున బయలుదేరి రనుకొందము. వీరల వేగము క్రమముగా నిముషమునకు 5, 4, 3, 2, 1 గజములు. ఆరంభబిందువునుండి బయలుదేరిన 22 నిముషములవరకు అందరు ఋజుగతిలో నున్నను, ఆరంభబిందువునుండి వరుసగా 110, 88, 66, 44, 22 గజముల దూరములో నుందురు. అపుడు A కు B మొదలగువారు వరుసగా 22, 44, 66, 88 గజముల వెనుక నుందురు. అపుడు A సమముగా ఆరంభబిందువుకు 180° దూరములో, అనగా వృత్తార్థములో నుండును. ఆపైనిముషమునుండి హెచ్చువేగము గల A కు మిగిలినవారు వెనుకకు బదులు ముందున్నట్లగుపడెదరు. A యొక్క ముఖము మార్పుచెందుట ఇందుకు కారణము. ఇట్లారంభబిందువునుండి బయలుదేరిన 44 నిముషములకు A ఆరంభస్థానమును చేరును. అపుడు వానికి E అనువాడు 44 గజముల ముందున్నట్లు భాసించునుగాని 176 గజములు వెనకనున్నట్లు భాసింపదు. ఇదియే చాపీయరేఖాగణితశాస్త్రము (Spherical Geometry and Spherical Trigonometry) యొక్క సంప్రదాయము.

కాన గ్రహముల గతి ప్రతిక్షణవిలక్షణముగాన వీటిలో నొక్కొక్కదాని వుదయముతో నుపలక్షితమగు వారము, లేక దినము సమముగా (Correct) ఇంత యని నిరూపింప వీలులేదు. పరమాధిక (Maximum) పరమాల్ప (Minimum) దినమానములుమాత్రము చెప్పవీలగును. ఈక్రింద అన్నిగ్రహములకు వుదయోపలక్షితదినముల ప్రమాణములు ప్రదర్శింతును.

| | పరమాధిక | పరమాల్ప |
|---|---|---|
| | ఘ. విఘ. | ఘ. విఘ. |
| రవిదినము | 60-11 | 60-8 |
| చంద్రదినము | 62-30 | 61-50 |
| కుజదినము | 60-5 | 59-55 |
| బుధదినము | 60-20 | 59-40 |

| | | |
|---|---|---|
| గురుదినము | 60-2 | 59-58 |
| శుక్రదినము | 60-15 | 59-45 |
| శనిదినము | 60-2 | 59-59 |

ఈ దినప్రమాణములందలి తారతమ్యమునుబట్టి భూమికి దగ్గర చంద్రగోళమును, ఆపైని వరుసగా దూరదూరములలో బుధ, శుక్ర, రవి, కుజ, గురు, శనులయొక్క గోళములున్ను వున్నట్లు సుకరముగా గ్రహింపనగును. దగ్గరలోనుండు గ్రహముయొక్క కక్ష్య (Orbit) ప్రమాణము అల్పముగాన, స్వల్పకాలములో పూర్తిగా తిరుగుటకు, తద్వారా ఆ గ్రహముయొక్క గతి శీఘ్రమగుటకు వుపపత్తి కుదురును. అట్లే గ్రహకక్ష్య దూరమైనకొలది కక్ష్యాప్రమాణము హెచ్చగుటకును, తద్వారా ఆ గ్రహముయొక్క గతి మందమగుటకును వుపపత్తి కుదురును. (Vide: Surya Siddhanta and Dynamical Astronomy)

వైదికవాఙ్మయము ననుసరించి చంద్రగోళము చాలా ప్రధానమైనది. మనము అన్ని ఇంద్రియములతోను చేయు అన్నిపనులను ముందు మనస్సుతో సంకల్పించినగాని అవల చేయజాలము. అట్లు అందరి మనస్సులయొక్క కేంద్రస్థానమగు సమష్టిరూపమే చంద్రగోళ మని శాస్త్రహృదయము.

మరిన్ని నదియొక్క ఈవలితీరమం దున్నవానికి అవలి యొడ్డున దూరదూరములలో నున్న వృక్షాదులు వాస్తవముగా నది ఒడ్డునకు చాలాదూరములోను, పరస్పరభిన్నదూరములలోను ఉన్నప్పటికి అవి అన్నియు ఒక్కచోటనే, ఆవలియొడ్డున కాన్పించు విధమున భూమికి దూరదూరములలో నున్న చంద్ర, బుధ, శుక్ర, రవి, కుజ, గురు, శని నక్షత్రకక్ష్యలు అన్నియు మిక్కిలి దగ్గరలో నుండు చంద్రకక్ష్యలోనే మన కగపడుచుండును.

పై రెండు కారణములనుబట్టియు చంద్రగోళమునకు ఎక్కువ ప్రాశస్త్యము నిచ్చి, ఊర్ధ్వలోకములతో మనకు సంబంధమును గలుగజేయునట్టియు, క్రమముగా జన్మాంతరములందు ఆయాలోక ప్రాప్తి యను ఫలమును, క్రమముగా నిశ్శ్రేయసమును మనకు చేకూర్చు క్రతువులు, వుపాసనలు మొదలగు వైదికకర్మలన్నియు ఈచంద్రగోళమే ద్వారముగా గలిగియున్నందున, పై రవ్యాదిదినములలో హెచ్చుప్రమాణము గల్గియున్న చంద్రదినమును, తత్సంయుక్తనియమముల నన్నిటిని 'చాంద్రమానము' అను విశేషసంజ్ఞతో శాస్త్రము వినియోగమును బోధించుచున్నది. ఇక మిగిలిన రవి, కుజ, బుధ, గురు, శుక్ర, శని దినములు 6 లో. ఋజు, వక్రాది భేదములతో నొప్పు దినములను ఒక్కొక్క చుట్టులో సగటుచేయగా (Average) ఘ 60-10 వచ్చును. ఇది రవియొక్క సగటుదినమావమైనది. అందువల్లనే "వారసాన్యె దేశవారంహి ప్రాచ్యాంకు రవి సంక్రమః" అను శాస్త్రము రవి పేరుతో వారము నుదాహరించినది. మరిన్ని మిగతా గ్రహముల దినములగలె ప్రతిదినము అత్యంత మార్పును జెందక ఈ రవిదినము కొద్దితేడాగా సమానముగా నుండును. గనుకనుగూడ మిగతాగ్రహములపేర్లతోగాక సూర్యుని పేరుతో వారమును బొందికచేసినది. మరిన్ని ఈరవిదినప్రమాణములో ఈపద్ధైవమ్యముగా మిగతా అన్నిగ్రహములకు ఒక వారము (పర్యాయము) చక్రభ్రమణము సిద్ధించుచున్నది.

ఇట్లీ కారణములచే సూర్యోదయమునుంచి తిరిగి సూర్యోదయమువరకు గల కాలమునకు 'వార'మను శబ్దము పరిభాషింపబడినది. దీనికే కువాసరము,దినము, సూర్యసావనదినము లేక సావనదినము (Solar Day) అని పేర్లు.

ఈవారమునకు ప్రారంభకాల మెపు డనునది విమర్శనీయము. మరిన్ని రవ్యాది అన్నిగ్రహములకు ప్రతివారముతోను అవిశేషముగా సంబంధ మేర్పడియుండగా ఆదివారము, సోమవారము అను మొదలగు విశేషవిభజనకు కారణ మేమనియు విమర్శింపవలయును.

వైదికవాఙ్మయములో పూర్వపక్షమనేను లేక విరోచనసిద్ధాంతము, సిద్ధాంతమనేను లేక ఇంద్రసిద్ధాంతము అను విభాగము గలదు. విరోచనసిద్ధాంతమందు ప్రత్యక్షమే ప్రమాణరాజము; మిగిలినవి తదనుసారులు. ఇంద్రసిద్ధాంతమందన్నో శబ్దప్రమాణము ప్రమాణసూర్ధన్యము; మిగిలినవి తదనుయాయులు. ఉభయమతము లందును ప్రత్యక్షమన ఇంద్రియగోచరమగునది; అనుమానమనగా ఇంద్రియగోచరమగు ధూమాదిలింగమునుబట్టి గోచరముగాని అగ్ని మొదలగువాటి నూహించుట; ఉపమానమన ఉదాహరణనుబట్టి గ్రహించుట ఇత్యాదులు సమానము.

కాని శబ్దప్రమాణలక్షణవిషయమై ఉభయసిద్ధాంతములలో కొద్ది భేద మున్నది. విరోచనసిద్ధాంతమందు శబ్దప్రమాణ మనగా యథార్థవక్తయగు ఆప్తుడగు మనుజునివాక్యము. ఇంద్రసిద్ధాంతమందు శబ్దప్రమాణ మనగా యథార్థవక్తయు, సర్వజనులకు ఆప్తుడును అగు ఈశ్వరవాక్యరూపమగు 'వేదమే' శబ్దప్రమాణము.

ఇంద్రసిద్ధాంతమునుబట్టి ప్రతిపదార్థమును అధిష్ఠానదేవతతో చేరము - అనగా ఆదిత్యు డను దేవతచే అధిష్ఠింపబడిన నేత్రమే నేత్రేంద్రియము. అట్లే వహ్ని యను దేవతచే అధిష్ఠితమగు సూర్యచంద్రుల 12 భాగల అంతరమే పాడ్యమితిథి. ఇక విరోచనసిద్ధాంతమునుబట్టి కేవలపదార్థమేగాని, పదార్థాతిరిక్తమగున దేమియులేదు. అనగా కేవల నేత్రమే నేత్రేంద్రియము. అటులనే రవిచంద్రుల మధ్య నుండు 12 భాగల దూరమే పాడ్యమితిథి.

ఇట్లే ఇంద్రసిద్ధాంతముప్రకారముకక్ష్యాక్రమముచే పైనచెప్పబడిన చంద్ర,బుధ, శుక్ర, రవి, కుజ, గురు, శనులయొక్క కక్ష్యలు (Orbits, అన్నియు ప్రత్యేకముగా నొక్కొక్క దేవతచే నధిష్ఠింపబడియుండురు. అట్టి అధిష్ఠానదేవతలు సర్వకాలమందును ఆయాకక్ష్యల

నధిష్ఠించియున్నను, వాటిలో నొక్కొక్క కక్ష్యాధిష్ఠానదేవతయొక్క ముఖము కొంతికాలముమాత్రమే భూమికి అభిముఖముగా నుండును. అన్ని కక్ష్యాధిష్ఠానదేవతలయొక్క ముఖమున్న ఏకకాలమందు భూమికి అభిముఖముగా ఒక ప్రళయకాలమందు తప్ప ఇతరమగు ప్రపంచస్థితికాలములో ఎప్పుడును ఉండదు.

ఈ కక్ష్యాధిష్ఠానదేవతలయొక్క ముఖములు ఒక హోరా (Hour) కాలములో నొక్కొకటిచొప్పున మారుచుండును. హోర యన లగ్నములో సగభాగము. దినములో 12 లగ్నములుగాన దినమునకు హోరలు 24. కాన ఈనాడు వారప్రారంభమందు, అనగా ఈనాటి 1-వహోరలో రవికక్ష్యాధిష్ఠానదేవతయొక్క ముఖము భూమికి అభిముఖముగా నున్నచో ఈనాటి రెండవహోరలో కక్ష్యాక్రమము పైనుంచి క్రిందకు 1 శని 2 గురు 3 కుజ 4 రవి 5 శుక్ర 6 బుధ 7 చంద్ర. గాన రవికక్ష్యకు క్రింది దగు శుక్రకక్ష్యాధిష్ఠానదేవతయొక్క ముఖము భూమికి అభిముఖముగా నుండును. అనగా శుక్రకక్ష్యాధిష్ఠానదేవతముఖము భూమికి అభిముఖమగు కాలమే రెండవ హోరాప్రారంభకాల మగును. ఇట్లే పూర్వహోర సమాప్తియగు కాలమున్న, పరహోర ఆరంభమగు కాలమున్న ఆ కక్ష్యాధిష్ఠానదేవతాముఖము భూమికి అభిముఖముగా మారుట మీదనే ఆధారపడియున్నది. అందుకొరకే రోజులో ఈ 24 హోరలను విభాగ మేర్పడెను.

క్రిందిపట్టికచొప్పున 24 హోరలతో ఆదివారముపూర్తికాగా 25-వ దగు చంద్రహోరతో, లేక చంద్రకక్ష్యాధిష్ఠానదేవతయొక్క ముఖముభూమికి అభిముఖముగానుండు సమయప్రారంభముతో చంద్రవారము, లేక సోమవారము ప్రారంభమగుచున్నది. కావుననే ఆదివారముతెంబడి సోమవార ముండుట ఉపపన్నమగుచున్నది.

ఇట్లు దినమునకు 24 హోరలుగాన ఏడు గ్రహముల కక్ష్యాధిష్ఠానదేవతలు మూడుపర్యాయములు వరుసతిరుగగా 3 × 7=21 హోరలు పూర్తియగును. నాల్గవ పర్యాయములో మూడు కక్ష్యాధిష్ఠానదేవతలు మారగా, నాల్గవ కక్ష్యాధిష్ఠానదేవతతో మరుసటి వారము ప్రారంభమగును. కావుననే ఏకక్ష్యాధిష్ఠానదేవతతో నే వారము ప్రారంభమగునో ఆవారము ఆగ్రహము పేరుతో పొందిక చేయబడి, సృష్ట్యాదినుండి నేటివరకు సమస్తభూమండలమందును సర్వులచేతను అప్రతిహతముగా వ్యవహరింపబడుచున్నది. ఈ ఈ రహస్యమును సూర్యసిద్ధాంతమందు

"మందామరేజ్యభూపుత్రసూర్యశుక్రేందుజేందవః
పరిభ్రమం త్యథోధస్థాః క్రమశ శ్శీఘ్రగామినః
మందాదధఃక్రమేణ స్యు శ్చతుర్థా దివసాధిపాః
హోరేశా స్సూర్యతనయా దధోధః క్రమశ స్తథా"

పైరీతనుగా తెలిపిన తద్గ్రంథకర్త సృష్ట్యాదిలయ

ఆదివారమునాటి 3 వ హోరలో శుక్రుని క్రింద దగు బుధకక్ష్యాధిష్ఠానదేవతముఖము భూమికి అభిముఖముగా నుండును.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 4 | ,, | బుధుని | ,, | చంద్ర | ,, | ,, | ,, | ,, |
| 5 | ,, | చంద్రుని | ,, | శని | ,, | ,, | ,, | ,, |
| 6 | ,, | శనికి | ,, | గురు | ,, | ,, | ,, | ,, |
| 7 | ,, | గురునకు | ,, | కుజ | ,, | ,, | ,, | ,, |
| 8 | ,, | కుజునకు | ,, | రవి | ,, | ,, | ,, | ,, |
| 9 | ,, | రవికి | ,, | శుక్ర | ,, | ,, | ,, | ,, |
| 10 | ,, | శుక్రునకు | ,, | బుధ | ,, | ,, | ,, | ,, |
| 11 | ,, | బుధునకు | ,, | చంద్ర | ,, | ,, | ,, | ,, |
| 12 | ,, | చంద్రునకు | ,, | శని | ,, | ,, | ,, | ,, |
| 13 | ,, | శనికి | ,, | గురు | ,, | ,, | ,, | ,, |
| 14 | ,, | గురునకు | ,, | కుజ | ,, | ,, | ,, | ,, |
| 15 | ,, | కుజునకు | ,, | రవి | ,, | ,, | ,, | ,, |
| 16 | ,, | రవికి | ,, | శుక్ర | ,, | ,, | ,, | ,, |
| 17 | ,, | శుక్రునకు | ,, | బుధ | ,, | ,, | ,, | ,, |
| 18 | ,, | బుధునకు | ,, | చంద్ర | ,, | ,, | ,, | ,, |
| 19 | ,, | చంద్రునకు | ,, | శని | ,, | ,, | ,, | ,, |
| 20 | ,, | శనికి | ,, | గురు | ,, | ,, | ,, | ,, |
| 21 | ,, | గురునకు | ,, | కుజ | ,, | ,, | ,, | ,, |
| 22 | ,, | కుజునకు | ,, | రవి | ,, | ,, | ,, | ,, |
| 23 | ,, | రవికి | ,, | శుక్ర | ,, | ,, | ,, | ,, |
| 24 | ,, | శుక్రునకు | ,, | బుధ | ,, | ,, | ,, | ,, |
| 25 | ,, | బుధునకు | ,, | చంద్ర | ,, | ,, | ,, | ,, |

పర్యంతము నిరంతరము సహస్రప్రభాభాసమానమగు కీర్తిని ప్రాచ్య పాశ్చాత్యదేశీయవిజ్ఞానములలో కెల్ల భారతీయవిజ్ఞానాతిశయమును వేనోళ్ల చాటుచు ఆచంద్రతారార్కము శాశ్వతముగా విరాజిల్లు ననుట కెవరును వెనుదీయరని నా విశ్వాసము. అట్టివాడు శ్రీ సూర్యుడుగాక అన్య డెవడగును?

ఈవిధముగా రవికక్ష్యకు 4 వది చంద్రకక్ష్య, దానికి నాల్గవది కుజకక్ష్య, దానికి నాల్గవది బుధకక్ష్య, దానికి నాల్గవది గురుకక్ష్య, దానికి నాల్గవది శుక్రకక్ష్య, దానికి నాల్గవది శనికక్ష్య, దానికి నాల్గవది రవికక్ష్య అగుచున్నవి.

కావుననే 1 ఆదివారము, 2 సోమవారము, 3 కుజ, లేక మంగళవారము, 4 బుధవారము, 5 గురువారము, 6 శుక్రవారము, 7 శనివారము; 8-వది తిరిగి పైయుక్తిచే రవివారము, లేక ఆదివారమే యగుచున్నది. కావుననే వారము లేదు. అంతకు హెచ్చుగాని, తక్కువగాని యుండ వీలులేదు.

ఇట్టి క్రమమునకు, సప్తసంఖ్యకు ఉపపత్తి కుదరగా నీ యేడింటిలో నేదొకదానినైనను మొదటనుంచి లెక్కించుటకు అవిశేషముగా అవకాశము గల్గియుండ, ముందు ఆదివారముతోనే యీ వారములను లెక్కింపవలె ననునది విమర్శింతము. ఆది యనగా ప్రారంభ మను అర్థము సుప్రసిద్ధము. దేనికి ప్రారంభ మను నాశంక కలుగగా, ప్రపంచమంతటను నీ ఆదివారాదిగా వారములను లెక్కించుచు వ్యవహరించుచున్నందున ప్రపంచసృష్టికి ఆది, లేక ప్రారంభ కాలము అని తెలియుచున్నందున సృష్ట్యాదికాలమునుగూర్చి ఒకింత విమర్శింతము.

ప్రకృతము అనేకగ్రహములు (Planets), వాటికి సంబంధించిన ఉచ్చలు (Apogees), వాటి పాతలు (Nodes) ఇవన్నియు మనకు ఆకాశమందు భిన్నభిన్నస్థానములందు కనుపించుచున్నవి. వాటి చలనముగూడ భాసించుచున్నది. ఆరంభకాల మెప్పుడును అన్నియు నొక నిర్దిష్టారంభస్థానమందుండి బయలుదేరు కాలమే కావలయును.

స్కూళ్లలో ఆటలలోగూడ (Sports) మైలుదూరము పరుగెత్తుఆట (One mile race) లో అందుకు సిద్ధపడిన పిల్లల నందరను ఒక నిర్దిష్ట ఆరంభస్థానమందు చేర్చి ఒకేకాలములో అందరను పరుగెత్తుట కారంభింప జేయుట మనము చూచుచున్నాము. అటులనే పరమేశ్వరుడు కల్పాదియందు నీగ్రహ, తదుచ్చ, పాతల నన్నిటిని సృష్టిచేసి ఒకే నిర్దిష్టారంభస్థానమగు మేషాదియం (First point of Aries) దుంచి, అటనుంచి వారలకు చలనమును ప్రారంభింపజేసెను. కాన ప్రకృతమందలి గ్రహముల భిన్నభిన్న స్థానములు వారల గతులను (Velocity) బట్టి వీరందరు ఆరంభ బిందువునందు ఎంతకాలముకిందట నుండురు అని లెక్కించగా, నీ తారణసంవత్సరాదికి 195, 58, 85,045 సంవత్సరములకు పూర్వమందు చైత్ర శుద్ధ పాడ్యమి ఆదివారమునా డగును. అంతేగాని పాశ్చాత్యులు కొందరు చెప్పిన క్రీ. పూ. 4004 గాని, జోసెఫ్ స్కాలిగర్ (Joseph Scaliger) చెప్పిన క్రీ. పూ. 4713 గాని ఇత్యాది పురుషుల బుద్ధికి స్వేచ్ఛగా తోచినట్టి తేదీలు ఎంతమాత్రము గావు. అవన్నియు గణితయుక్తిసహములుగాక యుక్తిశూన్యములే యగును. ప్రపంచము ఎప్పుడు అనాదిఅయినను, ఒక కల్పకాలము స్థితియు(432,00,00,000)తిరిగి కల్పకాలము ప్రళయమున్ను అగును. అట్టి కల్పాది ననుసరించి నేటికి 195,58,85,045 అని చెప్పబడినది. సృష్ట్యాది ఆదివారముతో ప్రారంభముగనుకనే నేటికిన్ని అన్ని దేశములందును ఆదివారాదిగా వారములను లెక్కించుట అప్రతిహతముగా వ్యవహారములో నున్నది.

ఇకను వారప్రవృత్తి సూర్యోదయముతో ప్రారంభమా, లేక ఎప్పుడు వారము ప్రారంభ మగు ననునది విమర్శింతము.

భూమండలీయమధ్యరేఖపై (Equator) పరస్పరసమానము లగు దూరములలో 4 స్థానములను శాస్త్రము నిర్మించినది. ఆ స్థానములు ప్రకృతపు గ్రీనిచ్‌నుండి లెక్కించివేసిన రేఖాంశల (Longitudes) ప్రకారము 76° యున్ను, భూమధ్యరేఖయు కలసిన స్థాన మొకటి; 166° యున్ను భూమధ్యరేఖయు కలసినది రెండవది; 256° యు భూమధ్యరేఖయు కలసినది మూడవది; 346° యు, భూమధ్యరేఖయు కలసినది నాల్గవది. ఇందు ఒక స్థానములో సూర్యోదయ మగునపుడే రెండవస్థానములో మధ్యాహ్నము, మూడవస్థానములో సూర్యాస్తమయము 4-వ స్థానములో అర్ధరాత్రియు నగును. ఇట్టి గణనా సౌకర్యముకొరకే శాస్త్రము ఈ నాలుగు స్థానములను నిర్దేశించినది.

సృష్ట్యాదికాలము ఇందలి మొదటిస్థానములో అర్ధరాత్రియు, రెండవస్థానములో సూర్యోదయకాలమును, మూడవ స్థానములో మధ్యాహ్నమును, నాల్గవస్థానములో సూర్యాస్తమయకాలమున్ను అగును. కాన ఆయాదేశప్రాంతవాసులు ఈప్రకారము వారముల ప్రారంభమును గ్రహించుచో, వైదికసిద్ధాంతము ప్రకారము తత్కాలీనవారాధిపగ్రహకక్ష్యాధిష్ఠానదేవతాభిముఖ్యరూపమగు, సాపత్తిక మగు వారఫలమును పొందగల్గుదురు.

పైకక్ష్యాక్రమ మంతయు భూకేంద్రకపద్ధతి (Geo-centric System) ననుసరించి శాస్త్రము బోధించినది. మరియొక పద్ధతిలో నీవారముల క్రమము ఎంతమాత్రము కుదరనట్లు తోచుచున్నది.

పాశ్చాత్యులు 15 శతాబ్దమువరకు నీభూకేంద్రకపద్ధతినే అవలంబించి, అనంతరమునుంచి నేటివరకు అనేకులచే అనేకరకములగు మార్పుల నొందించి ప్రకృతము సూర్యకేంద్రకపద్ధతి (Heliccentric System) ననుసరించియే గ్రహగతులను నిర్ణయించుచున్నారు.

(Nautical Almanack). ఈక్రింద క్లుప్తముగా వారల మార్పుల కాలముల నుదాహరించెదను.

| | | |
|---|---|---|
| 1500 A. D. | | Copernicus of Greece |
| 1550 | ,, | Tykobrahio of Sweden. |
| 1609 | ,, | Kipler. |
| 1687 | ,, | Newton |
| 1582 | ,, | Gregory XIII |
| 1610 | ,, | Galileo |
| 1898 | ,, | W. H. Pickering. |
| 1892 | ,, | Barnard |
| 1901 | ,, | A. Hinks |
| 1906 | ,, | Perrine |
| 1908 | ,, | Melotte |
| 1914 | ,, | Nicholson |
| 1600 | ,, | Tycho Brahe |
| 1675 | ,, | Roemer of Denmark. |
| 1725 | ,, | Bradley |
| 1851 | ,, | M Fowcault |
| 1924 | ,, | International Astronomical Conference |
| 1931 | ,, | ,, |

(Vide : History of Astronomy)

ప్రకృతము వారల అమలులో నున్న సూర్యకేంద్రకపద్ధతి ప్రకారము సూర్యునకు క్రమముగా బుధ, శుక్ర, భూమి (ఇచట భూమికి చంద్రు డుపగ్రహము) కుజ, గురు, శనులు దూరదూరములో నుందురు. చంద్రుని (ఉపగ్రహముకావున) గ్రహములలో లెక్కింప సబబుకాదు. అపుడు బుధ, శుక్ర, భూమి, కుజ, గురు, శనులు అను 6 ను, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో అను మూడును మొత్తం 9 గ్రహములు వ్యవహరింపబడవలెను. అందుచే ప్రకృతము తొమ్మిది వారములను లెక్కింప సమంజసముగాని, ప్రాచీనపు ఏడువారములను లెక్కించుట ఆపద్ధతిలో సమంజసముగా తోచుటలేదు. Bodes - Law ప్రకారము మరికొన్ని గ్రహము లుండవలెను. అవి ప్రకృతము గోచరముగానంతవరకు ఈ 9 వారములతో వ్యవహరించవలెను. మరియొక గ్రహము గోచరించినపుడు వారసంఖ్య పెరుగవలెను. లేక చంద్రుని గ్రహముగా గ్రహించుచో, కుజ, గురు, శనులకు గల ఉపగ్రహములనుగూడ సాజాత్యముచే గ్రహింపవలసివచ్చును. అన్నిటిని గ్రహించుచో వారముల సంఖ్య పుష్కలత్వము నొందును. అట్లే Revolution Theory ను, Vibration Theory ను విమర్శించినచో వారముల సంఖ్య ఇంకను పెరుగును.

లేక 15-వ శతాబ్దమునకుకాని, లేక ఏదో ఒకకాలమును ఏర్పరుచుకొని ఆకాలమునకు పూర్వముగాని అందరిచేతను తెలుసుకొనబడిన గ్రహములకుమాత్రమే వారములను ఏర్పరచుటయను ఒక సంప్రదాయము (Convention) చేయుటెడలగూడా సూర్యునినుంచి బుధ, శుక్ర, భూమి, చంద్ర, కుజ, గురు, శనులనుమాత్రమే ఆపద్ధతిలో గ్రహించినను, వెనుక మనము తెలుసుకున్న కక్ష్యాక్రమములోని నాల్గవ గ్రహము మరుసటి వారాధిపతి యగు నను నియమానుసారముగా 1 భూవారము, 2 శనివారము, 3 చంద్రవారము, 4 బుధవారము, 5 కుజవారము, 6 శుక్రవారను, 7 గురువారము అను నీక్రమము సిద్ధించును.

అట్లుగాక "The Earth's heleocentric longitude differs from the sun's geocentric longitude by 180°" అను నియమానుసారము విమర్శించి పై సూర్యకేంద్రకగ్రహముల కక్ష్యాక్రమములో సూర్యుని స్థానమునకు భూమిని, భూస్థానమునకు సూర్యుని మార్చినచో అపుడు కక్ష్యాక్రమము భూమినుండి చంద్రుడు (ఉపగ్రహముగాన భూమిదగ్గర నుండుట నంగీకరించి), 2 శుక్రుడు, 3 బుధుడు, 4 సూర్యుడు, 5 కుజుడు, 6 గురువు, 7 శని అను క్రమము సిద్ధించును. లేక పైనుండి 1 శని, 2 గురువు, 3 కుజుడు, 4 సూర్యుడు, 5 బుధుడు, 6 శుక్రుడు, 7 చంద్రుడు అను క్రమము సిద్ధించును.

"మందాదనః క్రమేణస్యు శ్చతుర్థా దివసాధిపాః" పైనుంచి క్రిందకు నాల్గవగ్రహము వారాధిపతి యగు నను పూర్వయుక్తి ననుసరించి 1 శనివారము, 2 రవివారము, 3 సోమవారము, 4 మంగళవారము, 5 శుక్రవారము, 6 గురువారము, 7 బుధవారము, 8 తిరిగి శనివారము అను క్రమము సిద్ధించును.

మరిన్ని సృష్ట్యాదికాలము 195,58,85,045 సం. లని అంగీకరింపక, క్రీ. పూ. 4004 గాని, క్రీ. పూ. 4713 గాని ఆరంభకాలమని అంగీకరించుచో ఆదివారము ప్రారంభవారముకాక, మరియొకటి ఒక్కొక్కమతమున ఒక్కొక్కవారము ఆరంభవారమగుచుండును.

కాన పాశ్చాత్యులున్ను, వారిచే బోధలనొందిన యూనివర్సిటీ పట్టభద్రులున్ను ఈవిషయమునుగూర్చి సమగ్రముగ విమర్శ లేక, పరిశోధనయొనర్చి, ఉపపత్తితో గూడిన వారముల క్రమమును నిర్ణయించి, అట్టిక్రమమును లోకమునంతట, లేక పాశ్చాత్యనాగరికతా దేశములలోనైనను ముందు అమలుజరిపించుటగాని, లేక ఉపపన్నములగు వారక్రమమును బట్టి గణితవిధానములను మార్చుటకౌ లేక సూర్యకేంద్రకగణితవిధానమునకును, ఇపుడు లోకప్రసిద్ధమగు వారక్రమమునకు ఉపపన్నమగు సంబంధమును కుదుర్చుటకౌ, ఎద్దియో ఒక విమర్శనాపూర్వకనిర్ణయము చేయగోరుచు ప్రకృతమింతతో నీవిషయమును ముగించి, పాఠకమహాశయులకు వదలివేయుచున్నాను.

# తంత్రశాస్త్రము-వామాచారము

= 'ఆనందపురి' =

తంత్రశాస్త్రమును ఆమూలాగ్రముగా పరిశీలింపకయే దురభిప్రాయపూరితము లగు సిద్ధాంతములను పెక్కుమంది ఉటంకించుచుందురు. ముఖ్యముగ, వామాచారము, పంచమకారసాధనయును నిరసింపబడినంతగా ఇతరవిషయములు తృణీకరింపబడలేదు. ఆయావిషయములను గురించి తంత్రశాస్త్రమును, తదభిజ్ఞులును నుడువు విషయములనే ఈ వ్యాసము అభివ్యక్తమొనర్చుచున్నది.

## ౧

తంత్రశాస్త్రము ఉపాసనాశాస్త్రము. ఇందు అధికారభేదము ననుసరించి విభిన్న దేవతలను విభిన్న పద్ధతులతో నారాధించు క్రమము ఉపదేశింపబడినది. తాంత్రికపరిభాషలో ఈ ఉపాసనాపద్ధతులు 'ఆచారము' లనబడును. కులార్ణవతంత్రము వేదాచారము, వైష్ణవాచారము, శైవాచారము, దక్షిణాచారము, వామాచారము, సిద్ధాంతాచారము, కౌలాచారము అను సప్తవిధాచారములను వర్ణించుచున్నది.[1]

విశ్వసారతంత్రము సంక్షేపముగ వామాచారము, దక్షిణాచారము అను రెండు ఆచారములనే పేర్కొనుచున్నది. మద్యమాంసాదికమగు పంచమకారములతో[2] నొనర్పబడు ఉపాసన వామాచారము. ఇవి లేకుండ నొనర్పబడు ఉపాసన దక్షిణాచారము.[3] ప్రస్తుతమీ రెండు ఆచారములను గురించియే ఆలోచింతము. ముందుగనే ఒక మాట చెప్పియుంచుట మంచిది. అస్మద్దేశీయులగు పూర్వాచార్యులు స్వావలంబితములగు ఉపాసనలకు సంబంధించిన గూఢవిషయములను లోకమునకు దెల్పుటలో నత్యంతమగు జాగరూకతను వహించెడువారు. ఇట్టి విషయములనుగురించి నల్గురతోడను ప్రసంగించుట అత్యంతము అనుచితము. అత్యంతగంభీరములును, సాధనాపేక్షితములును నగు విషయములను, కేవలము గ్రంథాధ్యయనమువలననే గ్రహింపబడదగని విషయములను వెల్లడించినయెడల అమర్యాదయే యగును. అసంస్కృతబుద్ధియగు వ్యక్తి కివిషయము లేరీతిగను ఉపకరింపజాలవు. విషయగ్రహణాసమర్థతవలనను, విపరీతగ్రహణమువలనను శ్రద్ధావిహీను డగును. ఒకసారి అశ్రద్ధ ఆవేశించినయెడల ఇక ఎన్నడును ఆవిషయములను గురించిన యాథార్థ్యమును గ్రహింపలేడు. యావజ్జీవము అజ్ఞతనే ఆశ్రయించి, ఆయావిషయములను గ్రహించెడు సౌకర్యములనుగూడ పోగొట్టుకొనును. కనుకనే సుప్రసిద్ధవైష్ణవాచార్యుడగు జీవగోస్వామి స్వవిరచితమగు షట్సందర్భాంతర్గతమగు భక్తిసందర్భమున "సాధనాసంబంధములును, పరమగుహ్యములును నగు విషయములను వెల్లడింపకూడదు." అని అనుశాసించినాడు. అద్వైతాచార్యుడగు మధుసూదనసరస్వతికూడ మహిమ్నస్తోత్ర వ్యాఖ్యయందు ప్రణవోపాసననుగురించి వివరించుచు, ఈ ఉపాసనారహస్యమును స్వయముగనే గురునినుండి గ్రహింపనగు నని నుడివినాడు.

వామాచారదక్షిణాచారములు రెండునుగూడ సాధనకు సంబంధించిన విషయములు. సాధనపథానువర్తులు కానివారి కీవిషయమున నెట్టి యభిజ్ఞతయును ఉండజాలదు. గ్రంథములు తెల్పునది అత్యల్పము. సాధనకు సంబంధించిన నిగూఢతత్త్వములను గ్రంథస్థమొనర్చు ఆచారము పూర్వమున లేదు. కాని, తంత్రశాస్త్రగ్రంథసంకలయితలందఱును సాధకు లగుటవలన కొంతమట్టుకు వామాచార

---

1. "సర్వేభ్య శ్చోత్తమా వేదా వేదేభ్యో వైష్ణవం పరమ్,
వైష్ణవా దుత్తమం శైవం శైవా ద్దక్షిణ ముత్తమమ్,
దక్షిణాదుత్తమం వామం వామాత్సిద్ధాంత ముత్తమమ్,
సిద్ధాంతా దుత్తమం కౌలం కౌలా త్పరతరం నహి."
—కులార్ణవతంత్రమ్, 2.

2. "మద్యం మాంసంచ మత్స్యంచ ముద్రా మైథునమేవచ,
మకారపంచకం దేవి! దేవతాప్రీతికారకమ్."
—కులార్ణవతంత్రమ్, 1.

3. "ఆచారో ద్వివిధో దేవి! వామదక్షిణ భేదతః,
పంచముద్రాది సంయుక్తో వామాచారః ప్రకీర్తితః
పంచముద్రాది రహితో దక్షిణాచార సంజ్ఞకః"
—విశ్వసారతంత్రమ్.

మునుగులించి మనము వారి రచనలనుండియే కొన్ని విషయములను గ్రహింపగల్గుచున్నారము.

## 2

పండితులలో పెక్కుమంది ఉపాసనలబోలు శ్రేష్ఠతత్త్వమునకు బాహ్యములగు పంచమకారములతో సంబంధ ముండరా దనియే తలతురు. వీరు కులార్ణవతంత్ర ప్రతిపాదితమైన ఆధ్యాత్మికార్థమునే గ్రహింపగోరుదురు. ఈ అర్థము కులార్ణవ తంత్ర పంచమాధ్యాయమున ప్రదర్శితమైనది. అచ్చట పంచమకారములకు బదులుగ వాసనాశబ్దము ప్రయోగింపబడినది. వాసనాశబ్దము దర్శనశాస్త్రమున 'సంస్కారము, సూక్ష్మస్వరూపము' అను నర్థముల వాడబడుచున్నది. పంచమకారముల ఆధ్యాత్మిక స్వరూప మన పంచమకారముల సూక్ష్మరూప మని పర్యవసానము.

మూలాధారమున కుండలినీశక్తి వెలయుచున్నది.[4] ఈ కుండలినీ శక్తిని సాధనవలన జాగరిత మొనర్చి, బ్రహ్మరంధ్రమున సహస్రదళపద్మమున నున్న పరమాత్మతో సంయోజిత మొనర్చి, చిన్మయుడగు పరమశివునితో కుండలినీ శక్తికి సమరసత్వమును, అనగా ఆత్యంతిక మగు సమ్మేళనమును గూర్పవలెను. అప్పుడొకానొక సుఖానుభూతి లభించును. ఆ స్థితియందు సహస్రదళపద్మనిఃసృతమగు సుధాపానమున సాధకుడు నిరతుడగును. ఈ సుధయే మద్యము. ఇది ప్రథమ మకారము.

జ్ఞానఖడ్గమున పాపపుణ్యరూప మగు పశువును బలియొనర్చి, పరమాత్మయందు చిత్తమును లయమొనర్పవలెను. ఇట్లొనర్పగలిగిన వాడే పలలాశి—మాంసభోజి. ఇది ద్వితీయమకారమగు మాంసము.

మనస్సును, సమస్తేంద్రియములను విషయవర్గమునుండి మరల్చి, అంతర్ముఖత్వము నందవలెను. ఇట్లొనర్పగలిగినవాడు మత్స్యాశి. ఇది తృతీయ మకారము.

కులకుండలినీ శక్తిని ప్రబోధించి, ఆ శక్తిని సేవింపగలిగిన వాడే శక్తిసేవకుడు. ఇది చతుర్థ మకారము.

ప్రబుద్ధమైన కుండలినీశక్తిని పరమాత్మతో సమ్మిళితమొనర్చి ఆనందానుభవ మందగల్గువాడు మైథునసేవి. ఇది పంచమమకారము.

గురుముఖమున నుండి-గ్రంథముఖమున కాదు — ఏవంవిధము లగు పంచమకారముల 'వాసన'ను గ్రహించి, పంచమకారములను సేవించినయెడల ముక్తి లభించును. మూలాధారమునుండి బ్రహ్మరంధ్రమువఱకును వ్యాపించియుండిన సుషుమ్నానాడియం దున్న 'లింగత్రయము' నెఱిగి, షట్చక్రభేదన మొనర్పగలిగినవాడే పంచమకారములను సేవింప సమర్థుడగును.[5] గురునినుండియు, కులశాస్త్రములనుండియు ఈ తత్త్వమును చక్కగా గ్రహించిన యనంతరమే పంచమకారములను సాధింపవలె నని నియమము. లేకుండిన భ్రష్టత్వమే సిద్ధించును.[6]

ఉపర్యుక్తవిషయములను విశదముగ నాలోచించిచూచిన యెడల ఈ ఆధ్యాత్మిక పంచమకారములు మహోచ్చమగు యోగావస్థనే నిర్దేశించుచున్న వని గ్రహింపగలము. ఈ స్థితిని బొందిన వానిని జీవన్ముక్తు డనదగును. వాసనాశబ్దమే 'పంచమకారము'ల సుసూక్ష్మత్వమును సూచించుచున్నది. యోగము నాశ్రయించిననే ఇట్టి సూక్ష్మస్థితి లభింపగల దను విషయమును సూచించుటకే 'యోగవిత్'శబ్దమును కులార్ణవతంత్రము ప్రయోగించుచున్నది. ఇది యోగమునందలి ప్రాథమికావస్థ కానేరదనియు, పరిపక్వస్థితియే యనియు 'లింగత్రయవిశేషజ్ఞ షడాధారవిభేదక'శబ్దములు తెలుపుచున్నవి. ఇట్టి స్థితిని బొందుట అంతగా తేలికయైన విషయము కాదు. గురూపదేశమును యథావిధిగ ననుష్ఠించినయెడలనే సిద్ధించును. విజ్ఞానశాస్త్రమునందలి ఆనుష్ఠానికవ్యాపారము (Practical work) గ్రంథావలోకముననే సిద్ధింపదు. యోగ్యుడగు అధ్యాపకుని సాహాయ్య మున్ననే సిద్ధించును. ఈ విషయమునే స్మరింపజేయుచు కులార్ణవతంత్రము ఉపక్రమోపసంహార న్యాయము నవలంబించి గురునినుండియే రహస్యమును గ్రహింప నుపదేశించుచున్నది.

## 3

కఠశ్వేతాశ్వతరోపనిషత్తులలోగూడ యోగవిషయము ప్రస్తావితమైన విషయము ఆధ్యాత్మికశాస్త్రాధ్యయన మొనర్చువారి కందఱకును దెలిసిన విషయము. పాతంజలదర్శనము ఈ వైదికయోగమునే విశేషముగ పర్యాలోచించుచున్నది. వైదికయోగ సాధనయును, తాంత్రికయోగ సాధనయును ఒకేపద్ధతి నవలంబించుచున్న వని చెప్పజాలము. ఉభయయోగముల ఆదర్శము ఒక్కటియగు జీవన్ముక్తియే యైనను, అనుష్ఠానపద్ధతియందు భేద మున్నది. కుండలినీశక్తిని చైతన్యవంత మొనర్చుటయే తాంత్రికయోగమునందలి

---

4. "దేహస్య మధ్యమో భాగో మూలాధార ఇతీర్యతే,
గుదస్య ద్వ్యంగులాదూర్ధ్వం మేఢ్రాత్తు ద్వ్యంగులా దధః.
త్రికోణోఽధోముఖాగ్రశ్చ కన్యకాయోనిసన్నిభః,
యత్ర కుండలినీనామ పరాశక్తిః ప్రతిష్ఠితా."
—మానసోల్లాస తంత్రమ్, 4-12-13.

5. "లింగత్రయవిశేషజ్ఞః షడాధారవిభేదకః"
—కులార్ణవతంత్రమ్, 5

6. "శ్రీగురోః కులశాస్త్రేభ్యః సమ్యగ్విజ్ఞాయ వాసనామ్,
పంచముద్రా నిషేవేత చాన్యథా పతితో భవేత్"
—కులార్ణవతంత్రమ్, 6

ప్రధానవ్యాపారము. వైదికయోగమున కుండలినీ ప్రసక్తియే లేదు. షట్చక్రభేదముకూడ ఉపనిషత్తులలోగాని, యోగసూత్రములలో గాని కానరాకున్నది. షట్చక్రభేద మొనర్చకున్న తాంత్రిక యోగమే లేదు.

ఈ పంచమకారములను 'వాసన'లని నిర్ణయించి కులార్ణవ తంత్ర మూరకుండలేదు. బాహ్యపంచమకారముల విషయముకూడ పంచమషష్ఠోల్లాసములలో పర్యాలోచింపబడినది. పంచమకారముల 'వాసన'ను, అనగా సూక్ష్మతత్త్వమును గ్రహింపకుండ వానినుపయోగించినచో పాతిత్య మాపాదిల్లు నను విషయము నింతకుపూర్వమే తెల్పితిమి. ఇక నీద్వివిధవిషయముల సామంజస్యము నూహింతము.

ఇంతవఱకు మనము గ్రహించిన దేమన: యోగసాధన యొక్క చరమస్థితియే వామాచారముయొక్క లక్ష్యము, లేక గమ్యము. ఈ గమ్యమునే కులార్ణవము వాసన యనుచున్నది. ఈ లక్ష్యమును బొందజేయు నిమిత్తమే బాహ్యపంచమకారోపదేశము. ఈ అభిప్రాయమును నిరాకరించినయెడల ద్వివిధ-పంచమకారముల కును సామంజస్య మేర్పడదు. యోగసాధకునకు మనస్థైర్యముతో బాటు మనఃప్రసాదముకూడ ఉండవలెను. దీనినిమిత్తమే పాతం జలదర్శనము ప్రాణాయామాదుల నుపదేశించుచున్నది. తంత్ర శాస్త్రము పంచమకారములవలననే ఈ యుద్దేశ్యమును సఫల మొనర్చుచున్న దనుకొనుటలో అసామంజస్య మేమియును లేదు.

కులార్ణవము కులమార్గము (వామాచారము)ను బహుళముగ ప్రశంసించియు,

> "కృపాణధారాగమనాన్ వ్యాఘ్రకంఠావలంబనాత్,
> భుజంగధారణా న్నూన మశక్యం కులసేవనమ్."
>
> —కులార్ణవతంత్రమ్, 2.

అని దీని కష్టసాధ్యత్వమును, విపన్నంకులత్వమును సూచించుచున్నది. కనుక, ఈసాధన సామాన్యుల నిమిత్తము కాదని తేలుచున్నది. లోకోత్తరులగువారికికూడ అసాధ్యవిషయ మనుటలో సందేహము లేదు. మఱియును, ఒకే వంశమున నందఱును అసాధారణ మహిమతో నుద్భవింపబోరు. కనుక నియ్యది వంశపారంపర్యముగ సాధనగకూడ గ్రహింపగలమా యను విషయముకూడ సంశయాస్పదము. ఇందు ఇష్టసిద్ధికంటె అనిష్టమే వాటిల్లు నను భయము శాస్త్రకారులకుగూడ కలదని వారి యభిప్రాయములను జూచిన గ్రహింపగలము.

## ౪

పరశురామకల్పసూత్రము వామాచారసంప్రదాయమునకు ప్రామాణ్యమగు గ్రంథము. ఇది ఉపాసకులకు కొన్ని నియమముల నేర్పరచుచున్నది. లోకవిద్విష్టమగు కర్మము[7] నాచరింపకూడ దనుట వానిలో నొకటి. వర్తమానకాలమున మద్యపానము శిష్టాచారసమ్మతము కాదు; లోకవిద్విష్టము. కనుక కులశాస్త్రముల నత్యంతముగ నాదరించువారుకూడ నిప్పుడు పంచమకారముల నాదరింపరాదని తేలుచున్నది. వ్యవహారపక్షమునగూడ, అత్యంతరహస్యముగనే గ్రహింపవలనుగాని, వెల్లడియైన నరకప్రాప్తి యని కల్పసూత్రము తెల్పుచున్నది.[8] మఱియును, సర్వక్షేత్రముల వీని వ్యవహారము శాస్త్రసమ్మతము కాదు. అనుకల్పముగ నిర్ధరింపబడిన ద్రవ్యములనే గ్రహింపవలెనను నియమ మున్నది.

లోకాచారవిరుద్ధమైనయెడలను,[9] దేశాచారవిరుద్ధమైనపట్లను, చిత్తశుద్ధి లేకున్నను[10] మద్యాదులను గ్రహింపకూడదు. తంత్ర శాస్త్రము మద్యపాన విధానమును హోమరూపమున వర్ణించుచున్నది.[11] పూజయం దుపయోగింపబడిన మద్యము హవిస్స్వరూపము. అవశిష్టాంశమును హోమమం దుపయోగింపవలెను. ఈ హోమాగ్ని సాధారణాగ్ని కాదు. స్వాంతర్గతమగు చైతన్యాగ్ని. ఈ హోమ మన్ననో, సహజసాధ్యము కాదు. ఈ హోమకర్మ మొనర్చువాని ఆధ్యాత్మికభావన మహోన్నతమై యుండవలెను. "అజ్ఞానరూపాంధకారమునకు విరోధియును, స్వయంప్రకాశమానమును నగు చైతన్యరూపాగ్ని నిత్యము నాయందు ప్రజ్వరిల్లుచున్నది; అందు నిఖిలవిశ్వమును నేను ఆహుతిగ నొసగుచున్నాను. ధర్మాధర్మరూపమగు హవిస్సును, ప్రదీప్తాత్మరూపమగు అగ్నియందు మన స్సను స్రువమును గ్రహించి, సుషుమ్నా నాడీపథమున నిభశం

---

7. "కామక్రోధలోభమోహ మదమాత్సర్య విహితహింసాస్తేయలోకవిద్విష్టవర్జనమ్." —పరశురామకల్పసూత్రమ్. 1-19

8. "ఆనందం బ్రహ్మణోరూపం తచ్చ దేహే వ్యవస్థితం, తస్యాభివ్యంజకాః పంచమకారాః, తైరర్చనం గుప్త్యా, ప్రాకట్యా న్నిరయః" (అందే, 1-12.)

9. "వ్యవహార - దేశ - స్వాతంత్ర్య - ప్రాణోద్వేగ - సహాయామయవయాంసి ప్రవిచార్యైవ తదనుకూలాః పంచమాది పరామర్శాః" (పరశురామకల్పసూత్రమ్, 10-76.)

10. "కులద్రవ్యం నిషేవేత యదా సత్త్వాధికా మతిః,
అన్యథా సేవనం కుర్యాత్ పతనాయైవ కల్పతే."
—కల్పసూత్రవృత్తి కారధృతమ్.

11. "అంతర్నిరంతర మనింధన మేధమానే
మోహాంధకారపరిపంథిని సంవిదాగ్నౌ,
కస్మింశ్చి దద్భుత మరీచివికాసభూమే
విశ్వం జుహోమి వసుధాది శివావసానమ్."
—వృత్తికారధృతమ్.

ద్రియవృత్తులను ఆహుతిగ నొసగుచున్నాను."[12] ధ్యాన మొనర్చుటకుగాను చిత్తస్థైర్య మావశ్యకము. దీనిని బొందజేయుటకే మద్యపానవిధి; చిత్తమును స్థిరమొనర్చి దేవతాధ్యాననిమగ్న మొనర్ప నగును. మద్యపానమున చిత్తమునకు వికారము ఘటిల్లకూడదు.[13]

✻

పంచమకారముల తీవ్రతను సహింపజాలనివారును, రోగపీడితులును, వృద్ధులును నగువారుగూడ దీనిని ఉపయోగింపకూడదు. ఈ విషయముల నన్నిటిని గమనించినయెడల ఈ సాధనకు అధికారి అత్యంతము దుర్లభుడు-లేనేలేడు-అనిపించును. పూర్ణాభిషిక్తుడను వ్యక్తి దీనిని యథేచ్ఛముగ నుపయోగింపవచ్చునందురుకాని, అట్టివాడుకూడ అరుదే.[14] పూర్ణాభిషిక్తు డన్నను, బ్రహ్మజ్ఞాని యన్నను ఒక్కటియే. అట్టివాడు యథేచ్ఛముగ వర్తింపవచ్చుననుట స్తుతియేగాని అన్యముకాదు. అతడు యథేచ్ఛముగ వర్తింపనువర్తింపడు; ఇట్టి సాధనతోడను ప్రయోజనము లేదు. అతడు కృతకృత్యుడు. తన్ను పూర్ణాభిషిక్తునిగ భావించు యథేచ్ఛావిహారిని తంత్రశాస్త్రవేత్తలే నిందించియున్నారు.[15]

వామాచారముకంటె దక్షిణాచారమే శీఘ్రముగ ముక్తిని ప్రసాదింపగల దని మహాపండితుడగు భాస్కరరాయలు లలితా సహస్రనామభాష్యమున స్పష్టముగ నుడివియున్నాడు. భాస్కరరాయలు స్వయముగ వామాచారము నవలంబించినవాడు. కాళికా పురాణముకూడ ఈవిషయమునే చెప్పుచున్నది. అయినను భాస్కరాదులు యథార్థాధికారిని వామాచారమును పరిగ్రహింపమని చెప్పినారు. ఇది యొక మతము.

శారదాతిలకతంత్రసంకలయితయగు లక్ష్మణేంద్రదేశికుడును, సౌందర్యలహరీటీకాకారుడగు లక్ష్మీధరుడును వామాచారము నొప్పలేదు. శివార్కమణిదీపికయందు అప్పయ్యదీక్షితులవారుకూడ వ్యతిరేకాభిప్రాయమునే సూచించిరి. తంత్రసారప్రణేతయగు కృష్ణానంద-ఆగమవాగీశుడుకూడ వామాచారము అత్యంతకఠిన మని అభిప్రాయ మొసగెను.[16]

ఈ విషయముల నన్నిటిని పర్యాలోచించిచూచినయెడల అత్యంతక్లిష్టమును, ప్రతిపదభయావహమును నగు వామాచారమును పరిత్యజించి దక్షిణాచారమును గ్రహించుటయే శ్రేయోదాయకము. వామాచారసాధన కర్హుడగువాడు నూటికి కోటికి సాధకులలో నొక డుండవచ్చును. అతనికి నానమోవాకములు.

---

12. "ద్రవ్య మాస్వాద్య విధినా మనోనిశ్చలతాం నయేత్,
తతో ధ్యాయేత్ పరంజ్యోతి రాత్మజ్యోతి స్సనాతనమ్."
—గణేశ్వరసంహితా.

13. "యావ న్న చలతే దృష్టి ర్యావ న్న చలతే మనః,
తావత్ పానం ప్రకుర్వీత పశుపాన మతః పరమ్.
యావన్నేంద్రియవైకల్యం యావన్న ముఖవైకృతమ్,
తావదేవ పిబేత్ ద్రవ్య మన్యథా పతనం భవేత్."
—పరమానందతంత్రమ్.

14. పరశురామకల్పసూత్రవృత్తి 5-22

15. అందే, 3-11

16. "త్వత్సమా ప్రకృతిశ్చేత్ స్యా త్మత్సమః పురుషో యది
తదైవ పరమేశాని సమర్థః కులసాధనే"



# త్రయః స్వప్నాః

తస్యత్రయ ఆవసథా
త్రయః స్వప్నాః
(ఐతరేయోపనిషత్తు 3-12)

శ్రీ నిర్వికల్పానందస్వామి

---

•

సత్యాన్వేషణనిమిత్తము అద్వైతవేదాంతులు అవలంబించిన ఉపాయములలో అవస్థాత్రయవిచారణ ఒకటి. జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూడు అవస్థలును మనకు అహరహము గోచరమగుచున్నవి. ఈవిషయమును గౌడపాదులవారు మాండూక్యకారికలలో సవిశేషముగ పరామర్శించియున్నారు.

ప్రస్తుత మీసిద్ధాంతమును వ్యాప్తిచేయ పరిశ్రమించినవారు ముగ్గురు. వారి పేర్లు: వి. సుబ్రహ్మణ్య అయ్యరు, వై. సుబ్రహ్మణ్యశర్మ, కె. ఎ. కృష్ణస్వామయ్యంగార్లు. తుదివారు కీర్తిశేషులు.

ఈ సిద్ధాంతములను వీరు శృంగేరిజగద్గురువు లైన శ్రీమత్ నృసింహభారతీ స్వామివారినుండి సేకరించినారు. వీరందఱును మైసూరురాజ్యవాస్తవ్యులే. వీరందఱును సంస్కృతాంగ్ల కర్ణాటకభాషల లో గ్రంథములను రచించినారు.

ఈ వ్యాసము దిక్ప్రదర్శనముగా వారి భావమును సాధ్యమైనంతవరకు వారిభాషలోనే వెల్లడింప ప్రయత్నించుచున్నది.

•

మూర్ఖుడను గొల్లని కథ యొకటి ఉన్నది—స్వాధిష్ఠితమగు వృక్షశాఖనే కుఠారకర్తరిత మొనర్ప నుంకించె నని. మూర్ఖత్వమున కిది ప్రకృష్టదృష్టాంతము. ఇంకొక కొమ్మమీదనుండి దానిని నరుకవలెను. లేనిచో, హస్తపాదములు చూర్ణితము లగును; పంచత్వము సిద్ధించును.

వ్యావహారికజీవితమున అవలంబింపవలసిన ఈ సరళనియమము దార్శనికతత్త్వానుసంధానక్షేత్రమునగూడ ప్రయోగార్హ మని ప్రాచీనమహర్షుల నిర్ధారణ. అహరహము అనుక్రమముగ మనుష్య జీవితమున సంభవించు జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడి అవస్థాత్రయమును, తదంతర్గతమగు అనుభవరాశిని గ్రహించి, వాని యథార్థతత్త్వమును నిరూపింపగోరునెడల : ఈమూడు అవస్థలకంటెను వేఱగు స్థానము—ఎటనుండి వీని నాఘాతమొనర్చినయెడల ఈమూడును తునుగుటయేకాక స్వహానికి ఆస్కారము లేకుండునో, అట్టిస్థానము ఆవశ్యకము. ఈస్థానాన్వేషణముయొక్క ఫలితము ఆత్మ నావిష్కరించుటతో ముగిసినది. మనుష్యుని వ్యక్తిత్వముతో అవినాభావ సంబంధము కలిగియున్న వని ఆపాతబుద్ధికి తోచెడి మనశ్శరీరములను, బుద్ధిని, ఇంద్రియములను, ప్రాణమును దాటి, వీనికిగూడ అస్తిత్వమును ప్రసాదించు ఆత్మవస్తువును ఋషీశ్వరులు వెదకి, కనుగొనిరి. బహుపరిశ్రమలబ్ధమగు ఈ ఆశ్రయము నధిష్ఠించినయెడల, కేవలము జాగ్రత్స్వప్నములనేకాక, చిత్తస్పందనవర్జితమును, ఆనందమాత్రానుభవస్థితియును నగు సుషుప్తినిగూడ పరీక్షింపవచ్చును. జాగ్రత్స్వప్న సుషుప్తులు అవిరతక్రమమున వచ్చుచుపోవుచుండును. ఆత్మ నిర్లిప్తదృష్టితో కేవలము వీక్షించుచుండును. ఇందలి పరిస్పందనములు దానిని స్పృశింపజాలవు. జాగ్రత్స్వప్నసుషుప్తులలోని జ్ఞానమునకు ఆరంభమును, అంతమును ఉన్నవి. ఆత్మయొక్క జ్ఞానమునకు ఆవిర్భావతిరోభావములు లేవు. ఆ జ్ఞానము సదైకరూపము; క్షయవృద్ధివివర్జితమగు శాశ్వతజ్ఞానము.

ఆత్మయం దీయవస్థాత్రయ భేదము లేదు. అది నిత్యము జాగ్రదవస్థయందే యున్నది. మనుష్యునకు సంభవించెడి జాగ్రత్స్వప్న సుషుప్తులు ఆత్మకు సత్తాశూన్యములగు మిథ్యాస్వప్నములు—త్రయః స్వప్నాః.

౨

మహర్షులీమాత్రమే నుడివి యూరకుండినయెడల, జీవన సంగ్రామ మన్న వారికి భీతి యనియు, కేవలము స్వాప్నిక భూములలోనే వారి పరిభ్రమణ మనియు నిందించుటకు ఆస్కార ముండెడిది. కాని వారు 'త్రయః స్వప్నాః' అని ఆగిపోలేదు. ఈ మూడు స్వప్నములను ద్రష్టయగు ఆత్మనుండి వేరుచేయబడినపిదప ఋషులు మఱియొక ప్రశ్నమును పర్యాలోచించిరి. వివిధవైచిత్ర్య యుక్తమగు అసంఖ్యానుభూతుల ధారాప్రవాహము మన జీవన క్షేత్రమును సర్వదా రససిక్త మొనర్చుచున్నది; అయినను పరీక్షించి చూచినయెడల దాని క్షణభంగురత్వమే ప్రతిపన్న మగుచున్నదే కాని, దీనిని శాశ్వతమనుటకు వీలులేదు. ఈ అనుభూతిప్రవాహము యొక్క నిసర్గోత్పన్న మెచ్చట? ఇది మిథ్యయే యైనను, సత్తాశూన్యమైనను ఇంద్రజాలమువలెను, క్షణప్రభవలెను గోచరమగుచున్న విషయమును విస్మరింపజాలము. క్షణార్ధసమయమునకైనను సత్యరూపమును ధరించు శక్తి దీని కెచ్చటనుండి కలిగినది? ఈ ప్రశ్నకు ఋషీశ్వరవాణి నిస్సందిగ్ధకంఠమున ఒసగిన ప్రత్యుత్తరము :

"ఆత్మైవేదం సర్వం" (ఛాందోగ్యము, 7-25-2)
"సర్వం ఖల్విదం బ్రహ్మ" (అందే, 3-14-1)
"ఈశావాస్య మిదం సర్వం" (ఈశావాస్యము, 1-1)
"అయ మాత్మా బ్రహ్మ" (మాండూక్యము 2)

అవస్థాత్రయలబ్ధమగు అనుభవరాశియే మనకడ జగద్రూపమును ధరించుచున్నది. ఈ అనుభవములయొక్క స్వరూపనిర్ధారణ మొనర్ప బూనుకొనినయెడల, నియ్యవి ఆత్మయొక్క అభివ్యక్తిగనే తోచును. అసంఖ్యగ్రహ తారకా మండితమగు ఆకాశమునుండి స్థావర జంగమపూర్ణమగు వసుంధరవరకు గల బ్రహ్మాండము ప్రథమ విచారమున నిస్సారమగు స్వప్నముగ తేలిపోవునది, తుదకు పరమసత్యము బ్రహ్మమై నిలబడుచున్నది. ఆపాతసత్యమగు ఈ జగదింద్రజాలము పరమసత్యమగు పరమేశ్వరునియందే ప్రతిష్ఠితమైయున్నది- మహాసింధువక్షమున దోచు అగణితబుద్బుద పరంపరలవలె. బుద్బుదముల వాస్తవస్వరూపము సముద్రము; జగత్తుయొక్క వాస్తవ తత్త్వము బ్రహ్మమే. ఈ బ్రహ్మ మెచ్చటనో యున్నదని కాదు. అంతరాంతరమున వెలయు నీ స్వరూపమే ఆత్మ -ఆత్మరూపివగు నీవే బ్రహ్మము. కనుక, స్వప్నత్రయ రూపమగు జగత్తును పరమసత్యమగు పరమేశ్వరునివలన నావృత మొనర్పుము. బుద్బుదము నుండి నీదృష్టిని మరల్చి, బుద్బుదముయొక్క వాస్తవస్వరూపమగు మహాసముద్రమును వీక్షింపుము. సార్ధత్రిహస్త పరిమితమగు ఈ మనుష్యశరీరమున నెంతటి గంభీరరహస్యము మరుగుపడియున్నది !! శరీరాంతర్గతమగు సారతత్త్వమే ఆ మహాసముద్రము. అందుండియే జగత్-బ్రహ్మాండము బుద్బుదమువలె లేచి లయమందుచున్నది. సారతత్త్వమునకును, జగత్ - బ్రహ్మాండమునకును భేదమే లేదు. భేదవివర్జితమును, అఖండమును, అద్వితీయమును అగు ఈ సారతత్త్వమే, ఈ సత్యవస్తువే మనుష్యుని యొక్కయు, జగత్తు యొక్కయు వాస్తవరూపము.

3

జగత్తుయొక్కయు, జీవనసమస్యయొక్కయు చరమమగు ఈ నివృత్తిని బొందునిమిత్తము మహర్షులు మొదట 'త్రిస్వప్నము'ల పారప్రాంతమునకు ప్రయాణమొనర్చియుండిరి. ఇందుండియే గవేషణ నొనర్చినయెడల, మనస్సునకు కావలసినంతగ విషయ జ్ఞానము లభించునే కాని, దార్శనికమగు తత్త్వాలోచనకు లక్ష్యమగు సత్యవస్తువు బహుదూరముననే యుండును. పాశ్చాత్య దర్శన శాస్త్రేతిహాసమును పరిశీలించిన ఈ విషయము విస్పష్ట మగును. గ్రీసు దేశీయుడగు థేవిస్ (*Thaves*) మొదలుకొని వర్తమానకాలమం దుండిన బర్గసా (*Bergson*) అలెగ్జాండరులవఱకు ఎన్ని మతవాదములు జీవన సమస్యను గూర్చి వెలసినవి ! పృథివిని దాటి, ఆకాశము నతిక్రమించి స్వర్గలోకము నంటి భగవంతునివఱకు పరివ్యాప్తమగుచు, దూరాతిదూర ప్రదేశముల నంటుచు, పండితుల భావన తిరుగాడుచున్నదే కాని ముక్తి నందకున్నది. తత్తోధిక మగు భారమును వహించి, పృథివీవక్షమున బడుంగుమని కూలుచున్నది. కొందఱు చరమసత్యమును జడపరమాణువు లనుచున్నారు. మఱికొంద ఱద్దానిని ప్రతిఘటించి చేతన పరమాణువు (*Monods*) లనుచున్నారు. కొందఱు ఈజగత్తును మానసకల్పన మనుచున్నారు. కొందఱీ విషయమును హాస్యాస్పదముగ భావించి, షడింద్రియ గ్రాహ్యమగు జగత్తు కేవల కల్పనము కాజాలదనుచున్నారు. డెకార్టే (*Des Cartes*) నిస్సందిగ్ధ సత్యమును ఆవిష్కరింపబోయి, సంశయ (*Doubt*) మను ఖడ్గమున ప్రాచీన సిద్ధాంతములను ఖండవిఖండిత మొనర్చెను. కాని, "నేను భావించుచున్నాడను" అను విషయమును సంశయింప జాలకపోయెను. ఈతని సిద్ధాంత స్తంభములమీదనే ఆధునిక పాశ్చాత్య దర్శనము నిలబడియున్న దని తలచువారిని విస్మయావిష్టుల నొనర్చుచు, ఆ స్తంభము లచిరముననే భగ్నము లొనర్పబడినవి.

కాంటు (*Kant*) దేశకాలనిమిత్తములను మనోధర్మము లని నిర్ణయించి సమకాలీనులను దిగ్భ్రాంతుల నొనర్చినయెడల హెగేలు (*Hegel*) ఆ మతవాదమును ఖండించెను.

ప్రధానవ్యాపారము. వైదికయోగమున కుండలినీ ప్రసక్తియే లేదు. షట్చక్రభేదముకూడ ఉపనిషత్తులలోగాని, యోగసూత్రములలో గాని కానరాకున్నది. షట్చక్రభేద మొనర్పకున్న తాంత్రిక యోగమే లేదు.

ఈ పంచమకారములను 'వాసన'లని నిర్ణయించి కులార్ణవ తంత్ర మూరకుండలేదు. బాహ్యపంచమకారముల విషయముకూడ పంచమషష్ఠోల్లాసములలో పర్యాలోచింపబడినది. పంచమకారముల 'వాసన'ను, అనగా సూక్ష్మతత్త్వమును గ్రహింపకుండ వానినుపయోగించినచో పాతిత్య మాపాదిల్లు నను విషయము నింతకుపూర్వమే తెల్పితిమి. ఇక నీద్వివిధవిషయముల సామంజస్యము నూహింతము.

ఇంతవఱకు మనము గ్రహించిన దేమన: యోగసాధన యొక్క చరమస్థితియే వామాచారముయొక్క లక్ష్యము, లేక గమ్యము. ఈ గమ్యమునే కులార్ణవము వాసన యనుచున్నది. ఈ లక్ష్యమును బొందజేయు నిమిత్తమే బాహ్యపంచమకారోపదేశము. ఈ అభిప్రాయమును నిరాకరించినయెడల ద్వివిధ-పంచమకారముల కును సామంజస్య మేర్పడదు. యోగసాధకునకు మనస్థైర్యముతో బాటు మనఃప్రసాదముకూడ ఉండవలెను. దీనినిమిత్తమే పాతం జలదర్శనము ప్రాణాయామాదుల నుపదేశించుచున్నది. తంత్ర శాస్త్రము పంచమకారములవలననే ఈ యుద్దేశ్యమును సఫల మొనర్చుచున్న దనుకొనుటలో అసామంజస్య మేమియునులేదు.

కులార్ణవము కులమార్గము (వామాచారము)ను బహుళముగ ప్రశంసించియు,

"కృపాణధారాగమనాన్ వ్యాఘ్రకంఠావలంబనాత్,
భుజంగధారణా న్నూన మశక్యం కులసేవనమ్."
—కులార్ణవతంత్రమ్, 2.

అని దీని కష్టసాధ్యత్వమును, విపత్సంకులత్వమును సూచించు చున్నది. కనుక, ఈసాధన సామాన్యుల నిమిత్తము కాదని తేలుచున్నది. లోకోత్తరులగువారికికూడ అసాధ్యవిషయ మనుటలో సందేహములేదు. మఱియును, ఒకే వంశమున నందఱును అసాధారణ మహిమతో నుద్భవింపబోరు. కనుక నియ్యది వంశపారంపర్యముగు సాధనగకూడ గ్రహింపగలమా యను విషయముకూడ సంశయాస్పదము. ఇందు ఇష్టసిద్ధికంటె అనిష్టమే వాటిల్లు నను భయము శాస్త్రకారులకుగూడ కలదని వారి యభిప్రాయములను జూచిన గ్రహింపగలము.

## ౪

పరశురామకల్పసూత్రము వామాచారసంప్రదాయమునకు ప్రామాణ్యమగు గ్రంథము. ఇది ఉపాసకులకు కొన్ని నియమముల నేర్పరచుచున్నది. లోకవిద్విష్టమగు కర్మము 7 నాచరింపకూడ దనుట వానిలో నొకటి. వర్తమానకాలమున మద్యపానము శిష్టాచారసమ్మతము కాదు; లోకవిద్విష్టము. కనుక కులశాస్త్రముల నత్యంతముగ నాదరించువారుకూడ నిప్పుడు పంచమకారముల నాదరింపరాదని తేలుచున్నది. వ్యవహారపక్షమునగూడ, అత్యంతరహస్యముగనే గ్రహింపనగునుగాని, వెల్లడియైన నరకప్రాప్తి యని కల్పసూత్రము తెల్పుచున్నది. 8 మఱియును, సర్వక్షేత్రముల వీని వ్యవహారము శాస్త్రసమ్మతము కాదు. అనుకల్పముగ నిర్ధరింపబడిన ద్రవ్యములనే గ్రహింపవలె నను నియమ మున్నది.

లోకాచారవిరుద్ధమైనయెడలను, 9 దేశాచారవిరుద్ధమైనపట్లను, చిత్తశుద్ధి లేకున్నను10 మద్యాదులను గ్రహింపకూడదు. తంత్రశాస్త్రము మద్యపాన విధానమును హోమరూపమున వర్ణించు చున్నది.11 పూజయం దుపయోగింపబడిన మద్యము హవిస్స్వరూపము. అవశిష్టాంశమును హోమమం దుపయోగింపవలెను. ఈ హోమాగ్ని సాధారణాగ్ని కాదు. స్వాంతర్గతమగు చైతన్యాగ్ని. ఈ హోమ మన్ననో, సహజసాధ్యము కాదు. ఈ హోమకర్మ మొనర్చువాని ఆధ్యాత్మికభావన మహోన్నతమై యుండవలెను. "అజ్ఞానరూపాంధకారమునకు విరోధియును, స్వయంప్రకాశమానమును నగు చైతన్యరూపాగ్ని నిత్యము నాయందు ప్రజ్వరిల్లుచున్నది; అందు నిఖిలవిశ్వమును నేను ఆహుతిగ నొసగుచున్నాను. ధర్మాధర్మరూపమగు హవిస్సును, ప్రదీప్తాత్మరూపమగు అగ్నియందు మన స్సను స్రువమును గ్రహించి, సుషుమ్నా నాడీపథమున నిఖిలేం

7. "కామక్రోధలోభమోహ మదమాత్సర్యా విహితహింసా స్తేయలోకవిద్విష్టవర్జనమ్." —పరశురామకల్పసూత్రమ్. 1-19

8. "ఆనందం బ్రహ్మణోరూపం తచ్చ దేహే వ్యవస్థితం, తస్యాభివ్యంజకాః పంచమకారాః, తైరర్చనం గుప్త్యా, ప్రాకట్యా న్నిరయః" (అందే, 1-12.)

9. "వ్యవహార - దేశ - స్వాత్మ్య - ప్రాణోద్వేగ - సహాయామయవయాంసి ప్రవిచార్యైవ తదనుకూలాః పంచమాది పరామర్శః" (పరశురామకల్పసూత్రమ్, 10-66.)

10. "కులద్రవ్యం నిషేవేత యదా సత్త్వాధికా మతిః,
అన్యథా సేవనం కుర్యాత్ పతనాయైవ కల్పతే."
—కల్పసూత్రవృత్తి కారధృతమ్.

11. "అంతర్నిరంతర మనింధన మేధమానే
మోహాంధకారపరిపంథిని సంవిదాగ్నౌ,
కస్మింశ్చి దద్భుత మరీచివికాసమానే
విశ్వం జుహోమి వసుధాది శివావసానమ్."
—వృత్తికారధృతమ్.

ద్రియవృత్తులను ఆహుతిగ నొసగుచున్నాను."[12] ధ్యాన మొనర్చుటకుగాను చిత్తస్థైర్య మావశ్యకము. దీనిని బొందజేయుటకే మద్యపానవిధి; చిత్తమును స్థిరమొనర్చి దేవతాధ్యాననిమగ్న మొనర్ప నగును. మద్యపానమున చిత్తమునకు వికారము ఘటిల్లకూడదు.[13]

పంచమకారముల తీవ్రతను సహింపజాలనివారును, రోగపీడితులును, వృద్ధులును నగువారుగూడ వీనిని ఉపయోగింపకూడదు. ఈ విషయముల నన్నిటిని గమనించినయెడల ఈ సాధనకు అధికారి అత్యంతము దుర్లభుడు-లేనేలేడు-అనిపించును. పూర్ణాభిషిక్తుడగు వ్యక్తి వీనిని యథేచ్ఛముగ నుపయోగింపవచ్చు నందురుకాని, అట్టివాడుకూడ అరుదే.[14] పూర్ణాభిషిక్తు డన్నను, బ్రహ్మజ్ఞాని యన్నను ఒక్కటియే. అట్టివాడు యథేచ్ఛముగ వర్తింపవచ్చుననుట స్తుతియేగాని అన్యముకాదు. అతడు యథేచ్ఛముగ వర్తింపనువర్తింపడు; ఇట్టి సాధనతోడను ప్రయోజనములేదు. అతడు కృతకృత్యుడు. తన్ను పూర్ణాభిషిక్తునిగ భావించు యథేచ్ఛావిహారిని తంత్రశాస్త్రవేత్తలే నిందించియున్నారు.[15]

వామాచారముకంటె దక్షిణాచారమే శీఘ్రముగ ముక్తిని ప్రసాదింపగల దని మహాపండితుడగు భాస్కరరాయలు లలితా సహస్రనామభాష్యమున స్పష్టముగ నుడివియున్నాడు. భాస్కరరాయలు స్వయముగ వామాచారము నవలంబించినవాడు. కాళికా పురాణముకూడ ఈవిషయమునే చెప్పుచున్నది. అయినను భాస్కరాదులు యథార్థాధికారిని వామాచారమును పరిగ్రహింపమని చెప్పినారు. ఇది యొక మతము.

శారదాతిలకతంత్రసంకలయితయగు లక్ష్మణేంద్రదేశికుడును, సౌందర్యలహరీటీకాకారుడగు లక్ష్మీధరుడును వామాచారము నొప్పలేదు. శివార్కమణిదీపికయందు అప్పయ్యదీక్షితులవారుకూడ వ్యతిరేకాభిప్రాయమునే సూచించిరి. తంత్రసారప్రణేతయగు కృష్ణానంద-ఆగమవాగీశుడుకూడ వామాచారము అత్యంతకఠిన మని అభిప్రాయ మొసగెను.[16]

ఈ విషయముల నన్నిటిని పర్యాలోచించిచూచినయెడల అత్యంతక్లిష్టమును, ప్రతిపదభయావహమును నగు వామాచారమును పరిత్యజించి దక్షిణాచారమును గ్రహించుటయే శ్రేయోదాయకము. వామాచారసాధన కర్హుడగువాడు నూటికి కోటికి సాధకులలో నొకడుండవచ్చును. అతనికి నానమోవాకములు.

12. "ద్రవ్యమాస్వాద్య విధినా మనోనిశ్చలతాంనయేత్,
తతోధ్యాయేత్ పరంజ్యోతి రాత్మజ్యోతి స్సనాతనమ్."
—గణేశ్వరసంహితా.

13. "యావన్నచలతే దృష్టి ర్యావన్నచలతే మనః,
తావత్ పానం ప్రకుర్వీత పశుపాన మతః పరమ్.
యావన్నేంద్రియవైకల్యం యావన్నముఖవైకృతమ్,
తావదేవ పిబేత్ ద్రవ్య మన్యథా పతనం భవేత్."
—పరమానందతంత్రమ్.

14. పరశురామకల్పసూత్రవృత్తి 5-22

15. అందే, 3-11

16. "త్వత్సమా ప్రకృతిశ్చేత్ స్యాన్మత్సమః పురుషోయది
తదైవ పరమేశాని సమర్థః కులసాధనే"



# ఇక్ష్వాకులనాటి ఆంధ్రబౌద్ధధర్మము*





= శ్రీ భావరాజు వెంకటకృష్ణరావు =

ఇపుడు వ్రాయబోవుచున్నది ఇక్ష్వాకులనాటి కథ! ఆశ్చర్యపడ నవసరము లేదు! ఇక్ష్వాకురాజవంశ మొకటి మన యంధ్రదేశమును, చక్రవర్తిలక్షణములతో సామ్రాజ్య మేలినట్లు, పరిపాలించెను. ఇక్ష్వాకులకు పూర్వము సాతవాహన రాజవంశము చిరకాలము - నాలుగువందల సంవత్సరములు అవిచ్ఛిన్నముగ నేకచ్ఛత్రాధిపత్యము వహించి, నర్మదా పినాకినీమధ్యస్థమైన సకలదక్షిణాపథమును, దక్షిణాపథేశ్వరులను బిరుదముతో పరిపాలించి తమ చిహ్నమును సర్వత్ర నిలిపెను; కాని ఎందుచేతనో కడుప్రాచీనతను దెలుపుటకు ఆంధ్ర భాషలో "ఇది యిక్ష్వాకులనాటి మాట" యని లోకోక్తిగా ఇక్ష్వాకుల పేరే నిలిచిపోయెను. ఇక్ష్వాకులతో ఆంధ్రభూమియందు బౌద్ధధర్మ మొక వెలుగు వెలిగి, మెఱపుతీగవలె అంతర్ధానమై పోయెను. ఆ కథ 'ఇక్ష్వాకులనాటిది' అని లోకమున పరిపాటి యయ్యెను. నిజమున కల్లై స్వప్నగతవృత్తాంతమట్లు ఆ కథజరిగెను.

సాతవాహనులకు పూర్వమునుండియు నంధ్రదేశమున నొక మూల ఇక్ష్వాకురాజవంశ మొకటి చిన్న మాండలిక రాజ్యసీమను సామంతరాజచిహ్నములతో పరిపాలించుచుండినట్లు పురాణేతిహాసములను బట్టి యూహింపవచ్చును. గుంటూరుసీమలో పల్నాడు తాలూకాలోని మాచెర్లకు సమీపమున నాగార్జునకొండ దరిని దొరికిన పాలరాతి శాసనములవలన కొన్ని చిత్రమయిన చరిత్రాంశములు తెలియవచ్చినవి. వాటిని సంగ్రహముగ చెప్పెదము. నాగార్జునకొండకు ఇంచుమించుగా రెండువైపులందును కృష్ణానది ప్రవహించుచున్నది. కృష్ణకు నంటి తూర్పుగా ఆ నాగార్జున కొండలోయలో పూర్వ మొకప్పుడు 'విజయపురి' యను మహానగర మొకటి విలసిల్లియుండెను. విజయపురికి తూర్పుగా నొక చిన్న గుట్ట యుండెను. దానిని నేడు జనులు 'నాపరాళ్లబోడు' అని వ్యవహరించుచున్నారు. పూర్వము ఇక్ష్వాకురాజుల కాలమునందును, తత్పూర్వము కొంతకాలమును, తరువాత కొన్ని యేండ్లును ఆ బోడు సర్వజగత్ప్రసిద్ధమై శ్రీపర్వత మను పేరుతో వ్యవహరింపబడి యుండెను. శ్రీపర్వతముపై ఆచార్యనాగార్జునుడు మహాయానధర్మ ప్రతిష్ఠాపకుడు, మహా తత్త్వవేత్త, ఒక సంఘారామమున చిరకాలము నివసించెను. శ్రీపర్వతము తన విభూతిని గోల్పోయినది మొదలు నాపరాళ్ల బోడయ్యెను. ఆ చెంత నున్న మహాపర్వతము, మదపుటేనుగువలె గాన్పించు నొక మహానగము, కృష్ణానది ఒరసి కొనుచు చుట్టి ప్రవహించునట్టి మహాశైలము నాగార్జునకొండ యయ్యెను. నాగార్జునుని నివాసమగుటవలన శ్రీ పర్వతము నాగార్జునుని కొండ యయ్యెను. శ్రీపర్వతనామము అంతరించి పోయినను నాగార్జునుని పేరుమాత్రము ఆ పెద్దకొండ నంటిపట్టుకొని నిలచి యున్నది. నాగార్జునుడు ఇంచుమించుగా క్రీ. శ. రెండవ శతాబ్దము నందు చిరకాలము జీవించెను. ఆతని నిర్వాణసిద్ధియు, సాతవాహన సామ్రాజ్యపతనమును ఒక్కసారిగా జరిగినట్లు ఊహింపవచ్చును. సాతవాహనసామ్రాజ్య మంతరించుటకు బూర్వమే ఇక్ష్వాకురాజవంశము ఆంధ్రదేశమును, చుటుకులము † ఆంధ్రభృత్యులు కుంత

---

* ఈవ్యాసమును నే నిటీవల వ్రాసిన **A History of the Early Dynasties of Andhradesa c 200- 6 25 A. D.** అను ఆంగ్లభాషలోని గ్రంథము ననుసరించి కూర్చితిని.

† చుటుకులము- చిన్న రాజవంశము. వారికే ఆంధ్రభృత్యులని పేరుండినట్లు పురాణములవలన తెలియుచున్నది. (చినవంశము అని అర్థము)

లను (కన్నడభూమిని), ఆభీరరాజవంశము మహారాష్ట్రసీమను మహాబలసంపన్నులయి దర్పముతో పాలింపసాగిరి. సాతవాహన సామ్రాజ్య మంతరించినవెనుక ఆ ముప్వురు రాజవంశములును సర్వ స్వతంత్రులయి, మహారాజబిరుదముతో దక్షిణాపథమును మూడు ఖండములుగా విభజించుకొని పరిపాలించిరి. ఈ మూడు రాజ వంశములును కూడ పట్టుమని ఐదు, ఆరు దశలకంటె ఎక్కువ కాలము రాజ్య మేలి, రాజోపభోగముల ననుభవించి యుండలేదు. ఇక్ష్వాకుమహారాజులను పురాణములు 'శ్రీ పర్వతీయు' లని పేర్కొనుచున్నవి. శ్రీపర్వతీయులన్న పేరు ఇక్ష్వాకురాజధాని విజయపురి జగత్ప్రసిద్ధమైన శ్రీ పర్వతము చెంత నుండుటబట్టి కలిగినట్లున్నది. శ్రీపర్వతీయులు మూడు తరములు మాత్రము సమ్రాట్టులై మహారాజబిరుదముతో సకలాంధ్రకళింగభూములనే గాక తమ వైభవముతో, తమ పలుకుబడితో, తమ బలదర్పములతో తమ యాజ్ఞ చెల్లుబడియగు నట్లు చక్రవర్తిలాంఛనములతో సకలదక్షిణాపథమునుగూడ సాత వాహనరాజవంశము ధరయేలినరీతి పరిపాలించిరి. కుంతలేశ్వరులయిన చుటుకులమువారును, ఘూర్జర, మహారాష్ట్ర, అనూప, సౌరాష్ట్ర ముల నేలిన ఆభీరులను, ఇక్ష్వాకురాజచంద్రులను సమ్రాట్టులుగా భావించి మన్నించిరి.

ఇక్ష్వాకులలో మహారాజపదలాంఛను డయిన ప్రథముడు వాసి ష్ఠీపుత్ర శ్రీ శాంతిమూల మహారాజు. ఈతని నామము ప్రాకృతము నందు 1 'ఇఖాకు సిరిసామి వాసిఠీపుత చాంతిమూల మహారా'జని కానవచ్చుచున్నది. 2 ఆతని రాజ్యకాలము క్రీ. శ. 200 మొదలు 218 అయియుండునని నిర్ణయించితిమి. ఆతడు చక్రవర్తి. నాగార్జున కొండశాసనములందాతడు 'సర్వార్థేషు అప్రతిహత సంకల్పు డనియు, అగ్నిహోత్ర, అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధయాజి యనియు, హిరణ్యకోటి, గోశతసహస్ర, హలశతసహస్ర ప్రదాయి యనియు, విరుపాక్షుపతి మహాసేన పరిగ్రహీతు డనియు, వాసిష్ఠీ పుత్రు డనియు, ఇక్ష్వాకుల శ్రీస్వామి' యనియు వర్ణింపబడినాడు. ఆతనికి ఇద్దరు తోబుట్టువులుండిరి: శాంతిశ్రీ, బ్రాహ్మిశ్రీ లనువారలు. శాంతిమూలునకు ఒక కొడుకును, ఒక కూతురునుండిరి. కుమారుడు శ్రీ వీరపురుషదత్త మహారాజు. ఆతడు మాఠరీ పుత్రుడు. కూతురు పేరు మరల శాంతిశ్రీ. ఆమె మహాసేనాపతి, మహాతలవర, మహా దండనాయక స్కంద విశాఖనాగుని భార్య. ధనకవంశమువారి కోడలు. మాఠరీ పుత్రునికి ఒక కుమారుడును, ఒక కుమార్తెయు గల రు. మహారాజ శ్రీమాఠరీపుత్ర వీరపురుషదత్తుడు క్రీ. శ. 218 మొద లుకొని 238 వరకు ఇరువదియేండ్లు రాజ్యపాలన మొనరించెను. ఆతని కుమారుడు వాసిష్ఠీపుత్రబహుబలశాంతమూలమహారాజు క్రీ. శ. 238 సంవత్సరమున, తండ్రి రాజ్యమునువిడిచి బౌద్ధపరివ్రాజకుడై సంఘా రామమును ప్రవేశించిన వెనుక పట్టాభిషిక్తుడై పండ్రెండు సంవత్స రములకాలము—250 వఱకు పరిపాలించెను. ఆతనితో ఇక్ష్వాకు రాజవంశము—ఒక అర్ధశతాబ్దికాలములో—అంతరించెను. బహుబల శాంతిమూలమహారాజు చెలియలు మహాదేవి శ్రీ కుండవల్లి (కొడబలి సిరి యని ప్రాకృతమున) కుంతలేశ్వరుడును, వనవాసి మహారాజును అగు శివస్కందవర్మను పెండ్లియాడెను.

ఇక్ష్వాకు మహారాజులలో మొదటివాడు వాసిష్ఠీపుత్రశ్రీశాంతి మూలుడు బ్రాహ్మణధర్మము నవలంబించినవాడు. బ్రాహ్మణుడే కావచ్చును. అగ్నిహోత్ర, అగ్నిష్టోమ, వాజపేయయాజి యని తెలుపబడియుండుట యీ యూహకు ప్రమాణము. బ్రాహ్మణ సంజాతు డగుటబట్టి అగ్నిష్టోమ, అగ్నిహోత్రక్రతువు కర్తాడు కాగ లిగినాడు. క్షత్రియుడైనచో జ్యోతిష్టోమమునకేగాని, అగ్నిష్టోమా దులకు అర్హుడు గాజాలడు. ఆతని కాలమున బ్రాహ్మణధర్మము రాజాదరణయు, పోషణయు కలిగి వర్ధిల్లెను. ఆతనివెనుక, వీర పురుషదత్తుని కాలమున విపరీతములు పుట్టెను. వీరపురుష దత్తమహారాజు తొలుత తండ్రితాతలవలె బ్రాహ్మణధర్మము నవలంబించినవాడును, బ్రాహ్మణుడును గూడ. కాని తన విజయ రాజ్యసంవత్సరము 6-వ యేట బౌద్ధమును స్వీకరించి ఉపాసకు డయ్యెను. ఆతని మేనత్తలు శాంతిశ్రీ బ్రాహ్మిశ్రీలు బౌద్ధధర్మము నవలంబించినవారు. ఎదురు మేనరికపు టాచారము ననుసరించి వీరపురుషదత్తుడు తన మేనత్తకూతుండ్రను పరిణయమాడెను. శాంతి శ్రీకి ఒక కుమార్తెయు, బ్రాహ్మిశ్రీ (హమ్మసిరి) కి ఇద్దరు కూతుం డ్రును ఉండిరి. వీరపురుషదత్తునికి ముప్వురు భార్యలుగాక ఇంకను భార్య లుండిరి. కాని మేనత్తకూతుండ్రు తనకు పట్టపుదేవులగుట యు, మేనత్తలపై తనకు విశేషాభిమానము, గౌరవము నుండుటబట్టి యు గాబోలు వీరపురుషదత్తుడు బౌద్ధధర్మమును స్వీకరించి బౌద్ధో పాసకు డయ్యెను. బ్రాహ్మణధర్మమును విసర్జించుటయేగాక దానిపై ద్వేషమును, అసహనమునుగూడ జూపెను. ఆతడు సింహాసన మెక్కిన తరువాత ఆతని విజయరాజ్య సంవత్సరములు ఆరవయేట అప్పటివఱకు జీర్ణస్థితియందుండి, శిథిలమైపోవుచున్న ధాతుగర్భస్థ మైన మహాచైత్యము—పూర్వము నాగార్జునాచార్యుని ప్రేరేపణమున నొక సాతవాహన చక్రవర్తిచే గట్టింపబడి శ్రీ పర్వతముపై నున్న మహాచైత్యము—మరల పునర్నిర్మాణము గావింపబడెను. ఆనూతన సృష్టికి కావలసియుండిన ధనమునంతయు వీరపురుషదత్తుని పెద

---

1. నాగార్జునకొండ శాసనములన్నియు ప్రాకృతభాషయందే కలవు. ఆ నాడంధ్రదేశమున జనులు మాటాడిన భాష ప్రాకృత మేమో?

2. 'చాంతి' పదము ఛాంతి యని చదివినపుడు 'ఛాంతి' సం స్కృతమున 'శాంతి' కావచ్చును. కాని 'చాంతి మూల' అను పాఠమే సాధువుగా కనిపించును.

మేనత్త శాంతిశ్రీ యొసంగెను. రాజబంధువులగు స్త్రీలందరును, రాణులందరును, రాణవాస స్త్రీలందరును తమకు తోచిన తెఱగు ధనము వెచ్చించి, స్తూపములను, చైత్యాలయములను, చతుశ్శాలలను, శిలావిహారములను నగరమందంతటను పెక్కింటిని గట్టించిరి. ఆనాటి స్తూపములు, చైత్యగృహములు, విహారములు అన్నియు కాలవశము ననేగాక ఇతర కారణములవలనకూడ శిథిలత నొంది, జీవచ్ఛవముల కంటె అధమస్థితియం దుండి, జీర్ణ అస్థిపంజరములవలె నేటికిని ఒక ఏబదింటికి మించి నాగార్జునకొండ పరిసరప్రాంతమున గానవచ్చు చున్నవి. వీరపురుషదత్తుని రాణులలో నొకతె ఉజ్జయినీపురాధీశుడు రుద్రసింహుని కుమార్తె రుద్రధరభట్టారికాదేవి. ఆమె కూడ తన భర్తమేనత్తవలె మహాచైత్యనిర్మాణమునకు కొంత ధనమిచ్చెను. తన హిత, సుఖ, నిర్వాణార్థ సిద్ధికొఱకు ఒక శిలా స్తంభమును తన పేరట ఎత్తించెను. మహాచైత్య నిర్మాణమున కుపయోగపడుటకై నూటడెబ్బది దీనారమాషకములను వెచ్చించెను.

మరల నంధ్రభూమిని మహావైభవముతో బౌద్ధధర్మము వ్యాపించుటకు మొదటి కారణమయిన ఆచార్యుడు నాగార్జునుడు. అతడు బుద్ధునితరువాత బుద్ధదేవునంతటి ప్రసిద్ధుడు. అతడు ఆచార్య అశ్వఘోషుని శిష్యుడు. అతడే మహాయాన సంప్రదాయ ప్రతిష్ఠాత. అతని తరువాత అతని అడుగుజాడల నడచినవా రెందరో కలరు. వారిలో ప్రథముడు ఆచార్య ఆర్యదేవుడు. అతడు నాగార్జునాచార్యుని యగ్రశిష్యుడు. ఇంకను అట్టివారు పెక్కం్రడు గలరు. కాని వారి నామములు ఇక్ష్వాకురాజుల శాసనములందు గానవచ్చుటలేదు. భదంత ఆచార్య ఆనందుని పవిత్రనామ మొక్కటి మాత్రము నాగార్జునకొండశాసనములందు గానవచ్చుచున్నది. అతడు పంణగాము వాస్తవ్యుడు. దిఘ (దీర్ఘ) మఝిమ (మధ్యమ) పంచమాతృకధరుడు. భదంతుడు. ఈ దీర్ఘ, మధ్యమనికాయములు, పంచమాతృకలు మొదలయినవి ఆంధ్ర బౌద్ధసన్యాసులకు, శ్రామణులకు పవిత్రము లయినవి. బ్రాహ్మణులకు స్వాధ్యాయ మెట్టిదో, ఆంధ్ర బౌద్ధపరివ్రాజకులకు, శ్రామణులకు ఈ నికాయ, పంచమాతృకధారణ మట్టిది. శాంతిశ్రీ బ్రాహ్మిశ్రీలు ధనము వెచ్చించుచుండ మహాచైత్యమును మరల కట్టించి దానిచుట్టును ఆర్యకంబముల నెత్తించి ప్రతిష్ఠచేయించి జగద్విఖ్యాతి దెచ్చినది ఆచార్యుడు ఆనందుడు.

నాగార్జునాచార్యుని యుపదేశముల ఫలితముగ, ఆంధ్రదేశీయుల ప్రతిభకారణముగ, సాతవాహన ఇక్ష్వాకురాజుల ప్రాపకము ఉద్బోధకముగ నుండ, ఆంధ్రభూమియందు బౌద్ధధర్మము వెల్లివిరిసి ప్రజ్వరిల్లెను. అది జనసామాన్యమునకు, దేశమునందు మారుమూలలకు విస్తరించి నెలవు సంపాదించెను. అంతటది భరతవర్ష మంతయు వ్యాపించెను. ఆంధ్రబౌద్ధముయొక్క మహత్వతత్వము లెట్టివో గాని అటు చీనిచిలాటదేశముల వారిని, ఇటు గాంధారకాశ్మీరములవారిని గూడ నాకర్షించెను. ఆంధ్రబౌద్ధమునకు ఒక విశిష్టత, ఒక నూత్న మర్యాదగ, ఒకరీతియుగలిగి మహాప్రఖ్యాతి ఏర్పడి, వ్యాపించెను. ఇంక చిత్రమేమన, ఆనాడు వర్ధిల్లిన ఆంధ్రబౌద్ధము ఈ నాడు కూడ దేశమందు కానుపించుచున్నది. కాని ఇది మరియొకరూపము; ఒక రీతిగా నూతనమైన అవతారము. ఆంధ్ర బౌద్ధమునకు అంధక సంప్రదాయ మని పేరు ఏర్పడినది. అంధకసంప్రదాయమునందు గల విశేషము కొంత తెలుసుకొనదగినది. ఆంధ్రదేశమున క్రీ. శ. పూర్వము రెండవ శతాబ్దము మొదలుకొని క్రీ. శ. 3-వ శతాబ్దము వఱకు వర్ధిల్లిన బౌద్ధసంప్రదాయములలో 'మహాసాంఘిక సంప్రదాయము' మిక్కిలి ప్రసిద్ధి కెక్కియుండెను. బుద్ధుని యనంతరము కొన్నియేండ్లు గడచిన పిమ్మట బౌద్ధులు (భిక్షువులు-పరివ్రాజకులు) రెండు తెగలుగా విడిపోయిరి. ఒకతెగపేరు 'మహాసాంఘికులు'; రెండవ సంప్రదాయమువారు 'మహాస్థవీరులు'. మహాసాంఘికులు మరల అయిదు శాఖలుగా క్రమముగా విడిపోయిరి. 'చైత్యు'లు, లేక 'చైత్యశీలురు' లేక పూర్వశైలీయులు, అపరశైలీయులు లేక అవర శైలీయులు, హైమవతీయులు, లోకోత్తరవాదులు, ప్రజ్ఞాపారమిత వాదులు అని ఆ అయిదు శాఖలకును పేర్లు కలిగెను. హైమవతీయులు, లోకోత్తరవాదులు, ప్రజ్ఞాపారమితవాదులు ఈ ముగ్వురు మాత్రము ఆంధ్రదేశమున వర్ధిల్లలేదు. ఆంధ్రదేశమునందు పూర్వశైలీయులు, అపరశైలీయులు మాత్రమే ప్రబలముగా వెలిసియుండిరి. అందును పూర్వశైలీయసంప్రదాయముకంటె అపరశైలీయసంప్రదాయమునకు ప్రజాదరణయు, రాజాదరణయు ఎక్కువగా నుండెను. శ్రీపర్వతము అపరశైలీయమునకు పట్టుగొమ్మ యయ్యెను. ధనకటకము పూర్వశైలీయమునకు ఆటపట్టయ్యెను. కాని ఆ రెండు నగరములందును ఉభయసంప్రదాయములు కూడ నెలకొనియుండెను.

నాగార్జునకొండ శాసనములవలన ఆర్యసంఘము (అయిర హంఘ), అపరమహావనశైలీయసంఘము (అపరమహావన (విన) సెలియ సంఘము) లేక అపరశైలీయసంఘము, పుబ్బ సెలియము, లేక పూర్వశైలీయసంఘము, బహుశ్రుతీయసంఘము, మహిశాసక, లేక మహింసాసకసంఘము అను అయిదు శాఖలవారు బౌద్ధపరివ్రాజకులు విజయపురియందు నివసించియుండినట్లు తెలియుచున్నది. అపరశైలీయులును, మహిశాసకులును థేరవాదులలోని అంతరశాఖవారని ప్రతీతి. అట్లే మహాసాంఘికవాదులలో నొక శాఖవారైన గోకులికలలో అంతరశాఖవారు బహుశ్రుతీయులు. అమరావతిస్తూపము చెంత దొరకిన శాసనములలో మరికొన్ని శాఖల పేర్లు కూడ కానబడుచున్నవి. నాగార్జునకొండ శాసనములలోని పేర్లే యించుక మార్పుతో అమరావతి ధనకటకమందు కానబడుచున్న వని యూహింపవచ్చును. కాని నాగార్జునకొండ దగ్గర కానరాని పేర్లు ఒకటి రెండు అమరావతియందు కాననగును. అమరావతియందు హంఘి, మహావనసెలియ, రాజసెలియ లేక రాజగిరినివాసక, చెతియ లేక చైత్యవాదక, సిద్ధార్థిక అను అయిదు శాఖల పేర్లు కానవచ్చెడిని. వాటిలో హంఘి

రో ఆర్యసంఘము, మహావనసెలియమే అపరమహావనశైలీయము అని నిర్ణయింపవచ్చును. చెతియవాదకులు పూర్వశైలీయులు కావచ్చును.

రాజశైలీయులు* 'చైత్యవాదకులు.' వీరు మాత్రము క్రొత్త వారు. చైత్యవాదకులు పూర్వశైలీయులేమో విచారింపవలసియున్నది

ఈ అంతరశాఖ లన్నియు భిన్నములు కావు ఈ శాఖీయు లందరును మహాసాంఘికసంప్రదాయము ననుసరించు సౌత్రాంతిక వాదులే! ఆంధ్ర భూమియందు వ్యాపించిన మహాసాంఘికము చిత్రముగా కొన్ని క్రొత్తసంప్రదాయములను నెలకొల్పెను కొంత కాలము గడచునప్పటికి ఆంధ్రదేశపు మహాసాంఘికధర్మము క్రొత్తలక్షణములను సంపాదించుకొని భిన్నధర్మముగా నేర్పడి, అంధకసంప్రదాయ మని విడిపోయెను ఇతర ప్రాంతములందు వర్ధిల్లిన మహాసాంఘికమునకును, ఆంధ్రదేశపు మహాసాంఘికమునకును ఎన్నో భేదము లేర్పడెను. అందువలన ఇతరప్రాంతములవారు ఆంధ్ర మహాసాంఘికమును అంధక సంప్రదాయమని వ్యవహరింపసాగిరి

అంధక సంప్రదాయమును, దానిలక్షణములను కొంతవఱకు నిరూపింప బ్రయత్నించెదము ఆంధ్రబౌద్ధమునకు ప్రాతిపదిక బౌద్ధ స్తూపము దానినిపరివేష్టించియుండునది 'సంఘారామము' స్తూపము సాధారణముగా బుద్ధ చిహ్నముపై, లేక ధాతువుపై గోళాకారముగ కట్టబడిన యొక మట్టిదిబ్బ. స్తూపమునకు చుట్టును ప్రదక్షిణమునకు అనుకూలముగానుండు ప్రదక్షిణపథ ముండును. దానిచుట్టును శిలా నిర్మితమయిన గోడ యుండును నిజమున కది గోడ గాదు. శిలా ఫలకములను శిల్పముతో నింపి, వాటిని చుట్టును నిలిపి ఆవరణ కట్టెదరు స్తూపమునకు నాలుగువైపులందును నాలుగు ద్వారములవంటివి యుండును. ఆ ద్వారముల కెదురుగా అయిదు ఆర్యకంబము లుండును నాల్గువైపులను నాలుగైదులు, ఇరవైకంబము లుండును స్తూపమునకు నేలమట్టమున నొక ప్రదక్షిణమార్గమును, అయిదడుగుల యెత్తున నొక వేదిక, దానిచుట్టును మరియొక ప్రదక్షిణ పథమును ఉండును వల యాకారముగ నొక మంటపమును, లేక దిమ్మను ఇటికలతో కట్టి, దాని అంచునందు మూడు నాలుగడుగుల వెడల్పున మార్గమునకు స్థలము విడిచిపెట్టి, నడిమిభాగమున స్తూపమును అర్ధగోళాకారముగ నిర్మింతురు ఈ శిలాఫలకపరివృతమైన స్తూపమునకు ఎదురుగా ఉభయపార్శ్వములందు రెండు చైత్యగృహములుండును ఆచైత్య గృహముల ఎడమవైపున నున్నదానికి ధాతుగర్భ చైత్యమనియు, కుడివైపున నున్నదానికి బుద్ధచైత్యమనియు పేళ్లు ధాతుగర్భచైత్యము

నందు అంతర్వేదికపై చిన్న స్తూపమొకటి లింగాకారముగనుండును బుద్ధ చైత్యమునందు భగవానుడగు బుద్ధుని శిలా ప్రతిమ యొకటి యుండును. ఈ రెండు చైత్యగృహములను దాటినవెనుక స్తూపమున కెదురుగా చతుశ్శాలామంటప ముండును దానిచుట్టును విహార ముండును విహారమునందు బౌద్ధసన్యాసులు నివసింతురు వారు చతు శ్శాలయందు శాస్త్రచర్చయు, విద్యావ్యాసంగమును గావించు చుందురు ఈ అయిదు కట్టడములను చేర్చి పలుకవలసినపుడు దానిని సంఘారామ మని చెప్పుదురు

భరతఖండమున ఇతరప్రాంతములందు బౌద్ధులు స్తూపములు నిర్మించుకొనిరిగాని ఆంధ్రస్తూపము వాటివలె నుండక కొంత విలక్షణముగా నుండును. ఆంధ్రస్తూపమును కొంత ఇదివఱకే వర్ణించితిమి. ఆంధ్రస్తూపము నేలమట్టమున నుండదు ఒక అంతర్వేదికపై గట్టబడును ఆ యంతర్వేదిక చక్రాకారముగ నుండును దానికి లోపల చక్రమునకు ఉండురీతిని నడిబొడ్డున 'కుంచమును', అందుండి అన్నివైపులకు ఆకులవలె గోడలును అంచువఱకు వ్యాపించియుండును. నేలమట్టమునుండి పైవఱకు ఈ ఆకులమధ్య మట్టి పోసి పూడ్చి యంతర్వేదికను కట్టెదరు ఆ యంతర్వేదికపై నుండును స్తూపము. స్తూపముచుట్టును నాలుగువైపులందు ఐదేసి ఆర్యకంబము లుండును † ఈ ఆయక, లేక ఆర్యకంబములు కేవలము అలంకారములకొఱకు కాదు 'పంచ'శబ్దము ఆంధ్రులకు, ఆంధ్రబౌద్ధధర్మమునకును ప్రీతికరమైనది. పంచమాతృకలు, పంచారామములు, పంచఆయకకంబములు, అంతయు 'పంచ' మయమే ఆయక కంబములు పెద్ద స్తూపములచెంత నుండినవి, ఇంచుమించుగా 10 మొదలుకొని 30 అడుగుల యెత్తు వరకు నుండెను. 'పంచ'సంఖ్య బుద్ధునిజీవితముతో సంబంధించినట్లు గానవచ్చును బుద్ధభగవానుని జీవితములో 1 ఆతని అవతరణము, లేక జననము, 2 సన్యాసము, 3 సంబోధి, 4 ప్రథమబోధ, 5 నిర్వాణసిద్ధి—ఈ అయిదును అయిదుతావులందు జరిగెను. వాటిని అన్నింటిని ఆంధ్రదేశీయులు సంజ్ఞారూపముగ పూజార్థము అయిదు ఆయకకంబములక్రింద నిరూపించిరాయని తోచును. ఏ స్తూపము చూచినను, ఏ శిల్పమును గాంచినను, మాటిమాటికి ఈ అయిదువృత్తాంతములే ప్రతి రూపకల్పనయందును కాన్పించు చుండును

ఆంధ్రదేశమున అంధకసంప్రదాయమునందు మహాసాంఘికులు బుద్ధుని పరమేశ్వరునిగ పరమాత్మస్వరూపునిగా నారాధించిరి. భగవంతు డని స్మరించిరి నాగార్జున కొండశాసనములందు బుద్ధదేవు డీవిధముగా వర్ణింపబడినాడు·

"భగవతో దేవరాజసకతస—సుపబుద్ధబోధినో—సవంజనో సవసతానుకంపస — జితరాగదోసమోహవిసముతస — మహాగణి, వసభ, గంధహథిస—సంమసంబుద్ధస—ధాతువర పరిగహితస."

* రాచకొండనుండివచ్చినది కాబోలు 'రాజగిరి'అను ఈపేరు

† బౌద్ధధర్మమువిధ్వస్తము గావింపబడిననాడు, బ్రాహ్మణము, శైవధర్మమును ప్రతిష్ఠింపబడిననాడు ఆంధ్రదేశమున పంచారామక్షేత్రములందుండిన ఈ ఆర్యకంబములను ఊడపెరికివైచి వాటినే శివ లింగములను చేసి ప్రతిష్ఠచేసినట్లు కన్పట్టును.

# ఇక్ష్వాకులనాటి ఆంధ్రబౌద్ధ ధర్మము

ఈ వర్ణన జదివినపుడు బుద్ధుడు విష్ణువుయొక్క పదియవ అవతారమగుటకు అంధకసంప్రదాయము దేశమునందు వ్యాపించుట కారణమైయుండునా అని సంశయముకలుగును. పై ప్రాకృతచరణములలోని పవిత్రభావము నాగార్జునకొండశాసనములన్నింటిలో ఎక్కువప్రాముఖ్యతగల 'బోధిసిరి' దానశాసనమునందు మరింతగా వివరింపబడియున్నది. బోధిసిరి బుధింనకుని (బుద్ధనాగ?) భార్య. ఆమెమేనమామ భద్రుడు ఇక్ష్వాకురాజులకు సువర్ణభాండాగారాధ్యక్షుడు బోధిసిరి (బోధిశ్రీ) శాసనమునందు బుద్ధుడీవిధముగా భగవంతుడైనాడు:

"భగవతో దేవమనుస సత హితసుఖ మగ (మాగ) దేసికస–జితకామ కొధ భయహారిస తరిస మోహదోస సదపిత మారబల దపమానపసమన కరస–దసబలమహాబలస–అరంగమాగ ధమచక పవతకస– చకలఖణసుకుమారసుజాతచరణస– తరుణదివసకర పభాస–సరదససి (శరదశశి) సోమ దరిసనస–సవలోకచిత మహితస–బుద్ధస–"

మరియొక శాసనమునందు బుద్ధుడు త్రైలోక్యనాథు డని తోపజేయుటకు 'భగవతో–తెలోక–ధంమ ధురావహాస' అనికూడ వర్ణింపబడినాడు. అంధక సంప్రదాయ కారణమున మనుష్యుడై జన్మించి ధర్మప్రబోధము చేసిన బుద్ధుడు దేవాదిదేవుడై, భగవంతుడై వెలసెను. పూజ లందుకొనెను. ఇష్టకామ్యములను సిద్ధింపజేసెను.

అంధక బౌద్ధమునందు మూడవ విశేష మొకటి కలదు బౌద్ధోపాసకుడుగాని, ఉపాసకిగాని పుణ్య కార్యాచరణమువలన తాను సంపాదించిన పుణ్యము ఫలమును తన కిష్టులు, బంధువులు, ఆప్తులు నైనవారు అనుభవించుటకు (పరిణమేతుం) సంకల్పించి బుద్ధదేవుని ఆరాధించును. ఈ భావము అంధ్రదేశమునందు పది, పదకొండు, పండ్రెండు, పదమూడవ శతాబ్దములనాటి శిలాశాసనములందుకూడ కానవచ్చును. ఉదాహరణమునకు ఇట్టివచనములు తరుచు శాసనములందు గానవచ్చుచుండును.

"తమ తలిదండ్రులకును, దనకును ధర్మార్థముగాను" మరియొకచోట "తమ యేలిక...మహారాజులకు బుణ్యముగాను. శ్రీ–శేఖర కాచంద్రార్కముగా నఖండవత్తి దీపమునకు"

బౌద్ధధర్మము అడుగంటిపోయిననాడు, బుద్ధుని పూజలు కూడ నాగిపోయిననాడు, అంధక సంప్రదాయములోని మహత్తమమైన భావ మొకటి హిందూమతమునందు– వర్ణాశ్రమధర్మ భూయిష్ఠమైన హిందూమతాచారమునందు సుస్థిరముగ నిలచిపోయెను. ఎందరో మాండలికప్రభువులు తమ యేలిక పుణ్యముకొరకు, దాసదాసీవర్గము, భటులు, తమ తమ యజమానుల పుణ్యముకొఱకును, కొందరు తమ తమ తలితండ్రుల పుణ్యముకొరకును ఎన్నో దేవతారామ తటాకాది ప్రతిష్ఠలు గావించిరి. దేవాలయములందు అఖండ దీపారాధనలు నిలిపిరి. అనేక ధానధర్మములు చేసియుండిరి. ఒకరు చేసికొనిన పుణ్యకార్యముయొక్క ఫలము నితరు లనభవించుటకు (పరిణమేతుం) సంకల్పించి, బుద్ధుని ఆరాధించు ఆచారము, అట్లు జరుగునన్న విశ్వాసము అంధ్రులలో తప్ప నితరులందు గానరాదు. పాలీగ్రంథములం దెచ్చటను ఈ విధానము చూపట్టదు అం దెక్కడ జూచినను అట్టదీప, అట్టశరణ ఇత్యాదికమైన మంత్రమునే ఉపాసకులు జపించి తరింప ప్రయత్నించెదరు. మరియొక విశేషము. బుద్ధోపాసకులయి దానముచేసినవారిలో కొందరును తమ ధర్మకార్యములవలన కలుగు పుణ్యఫలము తామే గాక తమ బంధుమిత్రవర్గముకూడ ఈలోకమునందును, పరలోకమునందును కూడ ఉభయలోకహితసుఖావహానార్థము బుద్ధదేవుని ప్రార్థింతురు. మరి కొందరు సర్వలోకహితార్థము ధర్మముల నాచరింతురు. ఇంతేకాదు. తా మొనర్చిన ధర్మకార్యములు తమకు నిర్వాణసంపత్తిసాధనము లని విశ్వసింతురు. ఈ నమ్మకముతో శాంతిశ్రీ మొదలయిన ఇక్ష్వాకుకులాంగన లందరు ధర్మములు చేసిరి. మహాచైత్యమును, విహారములను నిర్మించిరి. ఆయక స్తంభముల నెత్తించిరి. కాని ఈఅంధక సంప్రదాయమునకు భిన్నములయిన దానములు నాగార్జునకొండ శాసనములం దొకటియు, జగ్గయ్యపేట స్తూపము చెంత దొరకిన శాసనమునం దొకటియునుగానవచ్చుచున్నవి. వీటిలో నాగార్జునకొండ శాసనము కుందవల్లి శ్రీ మహాదేవిది. జగ్గయ్యపేటది సిద్ధార్థుడను గృహపతిది. వీరిరువురును తమ కేమియు పుణ్యఫలము నపేక్షింపలేదు "సవసతానాం హితసుఖార్థం" సర్వలోకహితార్థము అని ధర్మకార్యముల నాచరించిరి. అంధకుల దృష్టిలో నిర్వాణసంపత్తి భావన వేఱు. థేరవాదుల మతములో నిర్వాణస్థితి భావము వేఱు నిర్వాణస్థితి కేవలము అంధకుల దృష్టిలో శూన్యము గాదు. అది యొక రీతిగా సుఖఆనందస్థితి.

అంధక సంప్రదాయమువారికి అభిధమ్మపిటకము ప్రమాణమైనది వారు దిఘ, మఝిమనికాయములు అధ్యయనము చేయుచుండిరి ఈ నికాయములు సుత్తపిటకములోనివి. కాని నికాయధరులయిన బౌద్ధపరివ్రాజకులను ధమ్మకథికు లనియు, ధమ్మధరు లనియు, వినయధరు లనియు, మాతుకధరులనియు పిలుచు టది మగధదేశపు మహాసాంఘికుల ఆచారము. నికాయధరులని పిలుచుట ఆచారముగా కానుపింపదు కాని అంధ్రదేశపు మహాసాంఘికులు నికాయధరు లని ఆచార్యులను పేర్కొను టది యొక ప్రత్యేక విశేషము. భదంత ఆనందాచార్యుడు దీఘమఝిమనికాయధరు డనియు, దీఘమఝిమ పంచమాతుకనికాయధరు డనియు, దేశికుడనియు పేర్కొనబడినాడు.

అంధ్రదేశబౌద్ధమునం దిట్టి విశేషము లెన్నో కలవు వాటిలోని యాచారములు కొన్ని నేటివఱకు మన దేవాలయములందు నిలచియున్నవి అఖండవర్తి దీపములు పెట్టుట, పుష్పములతో పూజిం

చుట, పండ్లు వంటకములు దేవునికి ఆరగింపుచేయుట, నిత్యధూప దీప నైవేద్యాదులు ఎన్నో ఆంధ్ర సంప్రదాయములోనివే. బుద్ధుని పేరును, బుద్ధుని ప్రతిమలును, బౌద్ధస్తూపములును అంతరించి పోయినవిగాని తరువాతికాలమున బుద్ధుని స్థానములో కృష్ణుడును, శివుడును వివిధనామములతో వెలసిరి. బుద్ధప్రతిమ కేశవునిప్రతిమగా మారెను. ఆయక స్తంభములు పంచారామములందువలె శివమహాలింగము లయ్యెను.

బౌద్ధమతము బ్రాహ్మణమతముచే నెట్లు రూపుమాపబడియెనో మనము కొంతవఱకు ఊహించుకొనగలము. బుద్ధుని పూజయు, స్తూప చైత్యముల నిర్మాణమును మాసిపోయెనుగాని, బౌద్ధధర్మములు, అందు విశేషించి, మహాసాంఘికుల మహాయాన ఆంధక సంప్రదాయ మంతయు ఆంధ్రదేశమున నిలచిపోయెను. బ్రాహ్మణ ధర్మము ఆంధక సంప్రదాయమును తన కడుపులో నిముడ్చుకొని జీర్ణముచేసుకొనెను. ఆంధక సంప్రదాయములో గుణవిశేషముల నన్నింటిని బ్రాహ్మణధర్మము తనయందు నిలుపుకొనెను కాని బౌద్ధధర్మము మాత్రము ఇక్ష్వాకుల కాలమున అట్టి సహనబుద్ధితో బ్రాహ్మణధర్మమును చూడలేదు. కాలిక్రింద పెట్టి నలిపివేసి, ఎన్నెన్నివిధములనో అవమానించెను. ఆనాడు బౌద్ధధర్మము బ్రాహ్మణధర్మమును రూపుమాపదలచెను. పీడించెను. ఆర్తి నొందించెను. నాగార్జునకొండస్తూపముల చెంత గల శిలామంటప శిల్పములం దెచ్చటెచ్చట జూచినను ఒక చిత్రము కానవగును. మహారాజొకడు సప్తాంగపరివృతుడై చక్రవర్తి లక్షణోపేతుడై సప్తశిరములుగల నాగముచే అలంకృతమైన శివలింగమును, బ్రాహ్మణధర్మ చిహ్నమైన మహాలింగమును కాలితో త్రొక్కి అణచివేయుచున్న శిల్పచిత్రము కానవచ్చును. ఆ యకృత్యము నొనరించు చక్రవర్తి ఇక్ష్వాకులలో రెండవ వాడగు మాఠరీపుత్ర శ్రీ వీరపురుషదత్త మహారాజని నిరూపించవచ్చును. వీరపురుషదత్తుని కాలమున బౌద్ధ మత్యున్నతదశ ననుభవించెను. ఆతడు చూపిన మతవిద్వేషము కారణముగా, ఒక యిరువదియేండ్లలో ఇక్ష్వాకు రాజవంశము రూపురేఖలు లేకుండ అంతరించిపోయెను. మరి కొంత కాలమునకు బౌద్ధధర్మమే రూపుచెడి మాయమైపోయెను బౌద్ధధర్మము జగత్ప్రసిద్ధస్థితి, ఆ విభూతి, ఆ వైభవము ఇక్ష్వాకుల నాటి కథలై అంతరించిపోయెను.

# త్రయః స్వప్నాః

తస్యత్రయ ఆవసథా
త్రయః స్వప్నాః
(ఐతరేయోపనిషత్తు 3-12)

శ్రీ నిర్వికల్పానందస్వామి

●

సత్యాన్వేషణనిమిత్తము అద్వైతవేదాంతులు అవలంబించిన ఉపాయములలో అవస్థాత్రయవిచారణ ఒకటి. జాగ్రత్స్వప్నసుషుప్తు లను మూడు అవస్థలును మనకు అహరహము గోచరమగుచున్నవి. ఈవిషయమును గౌడపాదులవారు మాండూక్యకారికలలో సవిశేషముగ పరామర్శించియున్నారు.

ప్రస్తుత మీసిద్ధాంతమును వ్యాప్తిచేయ పరిశ్రమించినవారు ముగ్గురు. వారి పేర్లు: వి. సుబ్రహ్మణ్యఅయ్యరు, వై. సుబ్రహ్మణ్యశర్మ, కె. ఎ. కృష్ణస్వామయ్యంగార్లు. తుదివారు కీర్తిశేషులు.

ఈ సిద్ధాంతములను వీరు శృంగేరీజగద్గురువు లైన శ్రీమత్ నృసింహభారతీ స్వామివారినుండి సేకరించినారు. వీరందఱును మైసూరురాజ్యవాస్తవ్యులే. వీరందఱును సంస్కృతాంగ్ల కర్ణాటకభాషలలో గ్రంథములను రచించినారు.

ఈ వ్యాసము దిక్ప్రదర్శనముగా వారి భావమును సాధ్యమైనంతవరకు వారిభాషలోనే వెల్లడింప ప్రయత్నించుచున్నది.

●

మూర్ఖుడగు గొల్లని కథ యొకటి ఉన్నది—స్వాధిష్ఠితమగు వృక్షశాఖనే కుఠారకర్తరిత మొనర్ప నుంకించె నని. మూర్ఖత్వమున కిది ప్రకృష్టదృష్టాంతము ఇంకొక కొమ్మమీదనుండి దానిని నరుకవలెను. లేనిచో, హస్తపాదములు చూర్ణితము లగును; పంచత్వము సిద్ధించును.

వ్యావహారికజీవితమున అవలంబింపవలసిన ఈ సరళనియమము దార్శనికతత్త్వానుసంధానక్షేత్రమునగూడ ప్రయోగార్హ మని ప్రాచీనమహర్షుల నిర్ధారణ. అహరహము అనుక్రమముగ మనుష్య జీవితమున సంభవించు జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడి అవస్థాత్రయమును, తదంతర్గతమగు అనుభవరాశిని గ్రహించి, వాని యథార్థతత్త్వమును నిరూపింపగోరునెడల : ఈమూడు అవస్థలకంటెను వేఱగు స్థానము—ఎటనుండి వీని నాఘాతమొనర్చినయెడల ఈమూడును తునుగుటయేకాక స్వహానికి ఆస్కారము లేకుండునో—అట్టిస్థానము ఆవశ్యకము. ఈస్థానాన్వేషణముయొక్క ఫలితము ఆత్మ నావిష్కరించుటతో ముగిసినది. మనుష్యుని వ్యక్తిత్వముతో అవినాభావ సంబంధము కలిగియున్న వని ఆపాతబుద్ధికి తోచెడి మనశ్శరీరములను, బుద్ధిని, ఇంద్రియములను, ప్రాణమును దాటి, వీనికిగూడ అస్తిత్వమును ప్రసాదించు ఆత్మవస్తువును ఋషీశ్వరులు వెదకి, కనుగొనిరి. బహుపరిశ్రమలబ్ధమగు ఈ ఆశ్రయము నధిష్ఠించినయెడల, కేవలము జాగ్రత్స్వప్నములనేకాక, చిత్తస్పందవర్జితమును, ఆనందమాత్రానుభవస్థితియును నగు సుషుప్తినిగూడ పరీక్షింపవచ్చును. జాగ్రత్స్వప్న సుషుప్తులు అవిరతక్రమమున వచ్చుచుపోవుచుండును. ఆత్మ నిర్లిప్తదృష్టితో కేవలము వీక్షించుచుండును. ఇందలి పరిస్పందనములు దానిని స్పృశింపజాలవు. జాగ్రత్స్వప్న సుషుప్తులలోని జ్ఞానమునకు ఆరంభమును, అంతమును ఉన్నవి ఆత్మయొక్క జ్ఞానమునకు ఆవిర్భావతిరోభావములు లేవు. ఆ జ్ఞానము సదైకరూపము; క్షయవృద్ధివివర్జితమగు శాశ్వతజ్ఞానము

ఆత్మయందీయవస్థాత్రయభేదము లేదు. అది నిత్యమగు జాగ్రదవస్థయందే యున్నది. మనుష్యునకు సంభవించెడి జాగ్రత్స్వప్న సుషుప్తులు ఆత్మకు సత్తాశూన్యములగు మిథ్యాస్వప్నములు—త్రయః స్వప్నాః.

## 2

మహర్షులీమాత్రమే నుడివి యూరకుండినయెడల, జీవన సంగ్రామమన్న వారికి భీతి యనియు, కేవలము స్వాప్నిక భూములలోనే వారి పరిభ్రమణ మనియు నిందించుటకు ఆస్కారముండెడిది. కాని వారు 'త్రయః స్వప్నాః' అని ఆగిపోలేదు. ఈ మూడు స్వప్నములును ద్రష్టయగు ఆత్మనుండి వేరుచేయబడినపిదప ఋషులు మఱియొక ప్రశ్నమును పర్యాలోచించిరి. వివిధవైచిత్ర్యయుక్తమగు అసంఖ్యానుభూతుల ధారాప్రవాహము మన జీవన క్షేత్రమును సర్వదా రససిక్త మొనర్చుచున్నది; అయినను పరీక్షించి చూచినయెడల దాని క్షణభంగురత్వమే ప్రతిపన్నమగుచున్నదే కాని, దీనిని శాశ్వతమనుటకు వీలులేదు ఈ అనుభూతిప్రవాహము యొక్క నిసర్గోత్స మెచ్చట? ఇది మిథ్యయే యైనను, సత్తాశూన్యమైనను ఇంద్రజాలమువలెను, క్షణప్రభవలెను గోచరమగుచున్న విషయమును విస్మరింపజాలము క్షణార్ధసమయమునైనను సత్యరూపమును ధరించు శక్తి దీని కెచ్చటనుండి కలిగినది? ఈ ప్రశ్నకు ఋషీశ్వరవాణి నిస్సందిగ్ధకంఠమున ఒసగిన ప్రత్యుత్తరము.

"ఆత్మై వేదం సర్వం" (ఛాందోగ్యము, 7-25-2)
"సర్వం ఖల్విదం బ్రహ్మ" (అందే, 3-14-1)
"ఈశావాస్య మిదం సర్వం" (ఈశావాస్యము, 1-1)
"అయ మాత్మా బ్రహ్మ" (మాండూక్యము 2)

అవస్థాత్రయలబ్ధమగు అనుభవరాశియే మనకడ జగద్రూపమును ధరించుచున్నది. ఈ అనుభవములయొక్క స్వరూపనిర్ధారణ మొనర్పబూనుకొనినయెడల, నియ్యవి ఆత్మయొక్క అభివ్యక్తిగనే తోచును. అసంఖ్యగ్రహ తారకా మండితమగు ఆకాశమునుండి స్థావర జంగమపూర్ణమగు వసుంధరవరకు గల బ్రహ్మాండము ప్రథమ విచారమున నిస్సారమగు స్వప్నముగ తేలిపోవునది, తుదకు పరమసత్యమగు బ్రహ్మమై నిలబడుచున్నది ఆపాతసత్యమగు ఈ జగదింద్రజాలము పరమసత్యమగు పరమేశ్వరునియందే ప్రతిష్ఠితమైయున్నది- మహాసింధువక్షమున దోచు అగణితబుద్బుద పరంపరలవలె బుద్బుదముల వాస్తవస్వరూపము సముద్రము; జగత్తుయొక్క వాస్తవ తత్త్వము బ్రహ్మమే ఈ బ్రహ్మ మెచ్చటనో యున్నదని కాదు. అంతరాంతరమున వెలయు నీ స్వరూపమే ఆత్మ -'ఆత్మరూపివగు నీవే బ్రహ్మము. కనుక, స్వప్నత్రయ రూపమగు జగత్తును పరమ సత్యమగు పరమేశ్వరునివలన నావృత మొనర్పుము బుద్బుదము నుండి నీదృష్టిని మరల్చి, బుద్బుదముయొక్క వాస్తవస్వరూపమగు మహాసముద్రమును వీక్షింపుము. సార్ధత్రిహస్త పరిమితమగు ఈ మనుష్యశరీరమున నెంతటి గంభీరరహస్యము మరుగుపడియున్నది !! శరీరాంతర్గతమగు సారతత్త్వమే ఆ మహాసముద్రము. అందుండియే జగత్-బ్రహ్మాండము బుద్బుదమువలె లేచి లయమందుచున్నది. సారతత్త్వమునకును, జగత్ - బ్రహ్మాండమునకును భేదమే లేదు. భేదవివర్జితమును, అఖండమును, అద్వితీయమును అగు ఈ సార తత్త్వమే, ఈ సత్యవస్తువే మనుష్యుని యొక్కయు, జగత్తు యొక్కయు వాస్తవరూపము.

## 3

జగత్తుయొక్కయు, జీవనసమస్యయొక్కయు చరమమగు ఈ నిష్పత్తిని బొందునిమిత్తము మహర్షులు మొదట 'త్రిస్వప్నము'ల పారప్రాంతమునకు ప్రయాణమొనర్చియుండిరి. ఇందుండియే గవేషణ నొనర్చినయెడల, మనస్సునకు కావలసినంతగ విషయ జ్ఞానము లభించునే కాని, దార్శనికమగు తత్త్వాలోచనకు లక్ష్యమగు సత్యవస్తువు బహుదూరముననే యుండును. పాశ్చాత్య దర్శన శాస్త్రేతిహాసమును పరిశీలించిన ఈ విషయము విస్పష్ట మగును. గ్రీసు దేశీయుడగు థేవిస్ (*Thaves*) మొదలుకొని వర్తమానకాలమందుండిన బర్గసో (*Bergson*) అలెగ్జాండరులవఱకు ఎన్ని మతవాదములు జీవన సమస్యను గూర్చి వెలసినవి ! పృథివిని దాటి, ఆకాశము నతిక్రమించి స్వర్గలోకము నంటి భగవంతునివఱకు పరివ్యాప్తమగుచు, దూరాతిదూర ప్రదేశముల నంటుచు, పండితుల భావన తిరుగాడుచున్నదే కాని ముక్తి నందకున్నది. తతోధిక మగు భారమును వహించి, పృథివీవక్షమున బుడుంగుమని కూలుచున్నది. కొందఱు చరమసత్యమును జడపరమాణువు లనుచున్నారు. మఱికొందఱిద్దానిని ప్రతిఘటించి చేతన పరమాణువు (*Monods*) లనుచున్నారు. కొందఱు ఈజగత్తును మానసకల్పన మనుచున్నారు. కొందఱీ విషయమును హాస్యాస్పదముగ భావించి, షడింద్రియ గ్రాహ్యమగు జగత్తు కేవల కల్పనము కాజాలదనుచున్నారు. డెకార్టె (*Des Cartes*) నిస్సందిగ్ధ సత్యమును ఆవిష్కరింపబోయి, సంశయ (*Doubt*) మను ఖడ్గమున ప్రాచీన సిద్ధాంతములను ఖండవిఖండిత మొనర్చెను. కాని, "నేను భావించుచున్నాడను" అను విషయమును సంశయింపజాలకపోయెను. ఈతని సిద్ధాంత స్తంభములమీదనే ఆధునిక పాశ్చాత్య దర్శనము నిలబడియున్నదని తలచువారిని విస్మయావిష్టుల నొనర్చుచు, ఆ స్తంభము లచిరముననే భగ్నము లొనర్పబడినవి.

కాంటు (*Kant*) దేశకాలనిమిత్తములను మనోధర్మము లని నిర్ణయించి సమకాలీనులను దిగ్భ్రాంతుల నొనర్చినయెడల హెగేలు (*Hegel*) ఆ మతవాదమును ఖండించెను.

నీట్ శే (**Nietzsche**) అహంకారమును వృద్ధి నొనర్చి, రాక్షసునివలె పెంచుమని ఉపదేశించెను. శోపెన్ హేయర్ (**Schopenhaur**) అహంకారమును సమూలముగ నిర్మూలించిన యెడలనే పరమశాంతి లభించు నని ఉపదేశించెను కోంతే (**Comte**) దర్శనరాజ్యమున నెట్టి అపూర్వతయును ప్రవేశింప కూడదని బహిష్కరించెను ; అనగా ప్రత్యక్షమును, విజ్ఞానసమ్మతమును అగు విషయములనే గ్రహింపుడని అతని ఆదేశము. కాని, ఒక శతాబ్దము గడవక మునుపే, కోంతే జన్మభూమి యగు ఫ్రాంసు నందే బర్గసో జన్మించి, దార్శనికుని హస్తములలో వైజ్ఞానికుని యంత్రసామగ్రి శోభిల్ల దనియు, ధ్యానయోగము అవలంబనీయ మనియు వచించెను ఇ ట్లెంతగనో చూపవచ్చును గాని ఈ మహా మేధావుల మతములు వ్యర్థమనినచో రచయితయొక్క దాంభికత్వమే ప్రకాశిత మగును. అయినను, మతముల వలన తత్త్వము లభింపగలదా యను ప్రశ్న రాకమానదు ఒకింత ఆభాసముగ తత్త్వము గోచరమైనను రహస్యవినిర్ముక్తమును, అసందిగ్ధమును, సమగ్రమును (*whole*) నగు తత్త్వమును దర్శింప హృదయకుహరమునుండి వెలువడు ఆకాంక్షను దీర్చు ఉపాయమును ఈ శబ్దజాలము తెల్పగలదా ?

## ౪

శబ్దజాలమునకును, భావరాశికిని అంతము లేదు ఒక భావము ఇంకొక భావమునకు దారి చూపును ; ఒక శబ్దమును మల్లించిన, మఱియొక శబ్ద మచ్చట ప్రవేశించును శబ్దమును, భావమును ఆధార మొనర్చుకొని నిర్మింపబడునవి మతములు—తత్త్వము కాదు మహర్షులు కోరినది తత్త్వము. కనుకనే వారు నిర్భయులై నిస్సంకోచముగ 'త్రయః స్వప్నాః' అని ఘోషింపగల్గిరి. శబ్దమును, భావమును సాహాయ్యకములుగ గైకొని ప్రకాశింప జేయగోరున దెల్లయు 'దృశ్య' మగును దృశ్యము పరివర్తనశీలము. క్షణప్రధ్వంసి అలీకము. స్వప్నము. ఇందుండియే దీనిని గ్రహింపగోరినయెడల మూర్ఖుడగు గొల్లవానివలెనే క్రిందబడి కాలుచేతులను బోగొట్టుకొని పంచత్వము నందెదవు. ఇందుండి బయటకు రమ్ము. చంచలమగు దృశ్యవస్తువునుండి దృష్టిని మరల్చి, దృక్ వస్తువు ననుశీలింపుము. తత్త్వము లభింపగలదు.

బుద్బుదము బుద్బుదరూపమున క్షణవిధ్వంసి; సముద్రరూపమున అవినాశి. జగత్తు జగద్రూపమున వాస్తవతాశూన్యమగు స్వప్నము—బ్రహ్మరూపమున అవ్యయమును, చిరంతనమును నగు సత్యము కాని, జగత్తును బ్రహ్మరూపముగ గుర్తించుటకు ముందు జగద్రూపమును 'త్రయః స్వప్నాః' అని నిరాకరణమొనర్పవలెను. దీని నొనర్పవలె నన్న వైరాగ్యవాదము, దండకమండలములు, కౌపీనధారణము, గిరిగుహావాసము మున్నగునవి అనివార్యములుగ వచ్చి నిలచును కాని ఉపాయము లేదు సత్యవస్తువుయొక్క మూల్యము అన్నిటికంటెను అధికమైనను, ఇచ్చుటకు సంకోచించిన వీలుపడదు ఒకసారి సత్యశిఖరమును జేరుకొనినయెడల, త్యాగము నందలి కష్టమును భయమును సడలిపోవుటయేకాక, తతోధికమగు లాభము చేకూరగల దని మహర్షులు శపథపూర్వకముగ నుడివి యున్నారు

దృగ్దృశ్యముల స్థిరాస్థిరస్వభావప్రభేదమును గమనించి, వీనికిగూడ పారమున నున్న అఖండాద్వయజ్యోతిని ప్రకాశింపజేయు ప్రయత్నము కవియొక్క కల్పన కాదు బుద్ధి (*Intellect*) వినిర్మితమగు భావనీడమును కాదు. ఇది మెటీరియలిజమ్, ఐడియలిజమ్, ప్యాన్థియిజమ్ అను 'ఇజమ్' (*Ism*) లలో నేయొక్కటియును కాదు 'ఇజమ్' మతవాదమాత్రమును—తత్త్వము కాదు. ఈ అఖండాద్వయవస్తువు జగత్తునకును, జీవనమునకును సంబంధించిన దృఢసత్యము. దీని నాశ్రయమొనర్చుకొనియే తదితర సత్యములు వెలుగుచున్నవి ఈసత్యముయొక్క శ్రేష్ఠత్వమును, సుస్పష్టతను బహువిధములుగ వర్ణించియును ఉపనిషత్తులు తృప్తినందజాలక పోయినవి. అంధమును, తామసమును నగు మనుష్య దృష్టిని దివాలోకమువలెను, హస్తస్థితమగు ఆమలకమువలెను ఉజ్వలమును, సన్నికటమును నగు ఈ పరంజ్యోతి వైపునకు బహువిధములుగ నాకర్షింప ప్రయత్నించిరి ఈ సత్యవస్తువు బయటను లోపలను, దూరముననను నికటముననను, పూర్వముననను వర్తమానముననను సర్వదా సర్వావస్థలయందు నిన్నావరించుకొనియే యున్నది 'ప్రతిబోధవిదితమ్' (కేన 2-4) - ప్రతిచింతతోడను అది వెలుగొందుచున్నది 'దృష్టే ద్రష్టా' (కేన 2-3) - నీ చూపులలో చూపై వెలువడుచున్నది 'ప్రాణస్య ప్రాణః' (కేన 1-2)- నీ ప్రాణముయొక్క ప్రాణము 'పుచ్ఛం ప్రతిష్ఠా' (తై. ఉ. 2-5) - నీ భోగ్యజగత్తునకు ఆధారము 'అంతరంతరం యదయ మాత్మా' (బృహ ఉ. 1-4-8) - నీ అంతరముయొక్క అంతరమునగూడ నిదే వెలుగొందుచున్నది.

## ౫

'త్రయః స్వప్నాః', 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనునవి ఆత్మవిద్యకును, బ్రహ్మవిద్యకును చరమములగు సిద్ధాంతములు. ఏ ఉపాయముల నవలంబించి మహర్షులీ తత్త్వములను బొందగల్గినారను విషయమున అభిప్రాయభేద మున్నది కాని, మతవాదములను నిర్మించు విద్య వారి కగమ్యముగనే యుండెనని చెప్పవచ్చును. ముఖ్యముగ ప్రాచ్యపాశ్చాత్య దర్శనము లేవిధానము ననుసరించి, ఏ కల్పనావిధానమున నిర్మితములైనవో దానిని వారు గ్రహింప లేదనియే చెప్పనగును. ఏలయన, నేడొకడు బుద్ధిశక్తివలన కల్పించిన విషయము అంతకంటె బుద్ధిమంతుడగు వానికడ పరాస్తమగును.

నేడు వైజ్ఞానికులు అవలంబించుచున్న ప్రణాళికనే, అనగా ఆలోచ్య విషయసంబంధములగు తథ్యముల నన్నిటిని గ్రహించి, వానిని శ్రేణీబద్ధమొనర్చి, పక్షపాతమును స్వాభిరుచిని వదలి స్ఫుటముగ పరీక్షించి ఫలితమును సంగ్రహించుపద్ధతినే వా రవలంబించి రని నుడువదగును. ఈరీతినిబట్టి చూచినయెడల ఆత్మవిద్యయును, బ్రహ్మవిద్యయును దార్శనికమతవాదములుగ పరిగ్రహింపబడక, 'విజ్ఞానము' (*Science*) గనే పరిగణింపబడవలసియున్నది.

## ౬

ఏబదియేండ్లకు పూర్వము మనస్సు విజ్ఞానశాస్త్రమునకు పరీక్షా విషయ మగునని ఎవ్వరును తలంచలేదు నేడు మన స్తత్త్వము విజ్ఞానశాఖయై నిలచినది. ఆత్మ మనస్సుకంటె సూక్ష్మమైనది. ఈ ఆత్మవస్తువుకూడ విజ్ఞానసమ్మతమగు ప్రణాళి ననుసరించి పర్యాలోచిత మవగలదా? పూర్వ మీరీతి అవలంబింపబడినట్లు ప్రమాణము లున్నవి. వర్తమానకాలమున ఈ శాస్త్రము పునఃప్రతిష్ఠిత మగు నను సూచనలు లభించుచున్నవి. జడ - విజ్ఞానశాస్త్రము సత్యాన్వేషణేచ్ఛను విశేషముగ పురికొల్పినది. అచిరముననే వైజ్ఞానికుడు ఆత్మవస్తువునే గవేషణావిషయముగ పరిగ్రహించినను పరిగ్రహింపవచ్చును. మన స్తత్త్వమును విప్పిచెప్పి, వైజ్ఞానికుడు సమష్టి జీవనముననూ, వ్యష్టిజీవనమునను క్రొత్త వెలుగులను నింపినాడు. ఇట్లే ఆత్మవిజ్ఞానముగూడ పర్యాలోచితమైనయెడల, మనుష్యజీవనము అశేషకళ్యాణమండిత మగును. వర్తమాన నాగరికతయొక్క దృష్టి భంగికూడ పరివర్తిత మవగలదు.

ఆత్మవిద్య 'సర్వవిద్యలకును ప్రతిష్ఠ'మని ప్రాచీనవాణి. కనుక ఈ విజ్ఞానము కేవలము జడపదార్థమును (*Matter*) గాని, శక్తిని (*Energy*) గాని, ప్రాణమును (*Life*) గాని, మనస్సును (*Mind*) గాని, లేక ఇట్టిదేయగు మఱి యేయొక్క విషయమును గాని విడిగా అన్వేషణావిషయముగ గ్రహింపజాలదు. జగత్తునను, జీవితమునను గల తథ్యముల నన్నిటిని మథించి సమన్విత మొనర్చిన యెడలనే ఈ అమృతము లభింపగలదు. ఆత్మవిజ్ఞానముయొక్క లక్ష్యము సర్వవిజ్ఞానము (*The Science of the whole*).

వైజ్ఞానికమగు సమీక్షణప్రణాళి అత్యంతకఠినము. అలసులును, పరిశ్రమరహితులును, సంస్కారబంధితులును, ఏకాగ్రరహితులును నగువారి కిది అందని మ్రాను. సత్యానుసంధానమున అవమానము, కష్టపరంపర, మృత్యువుకూడ తుచ్ఛములగును. వైజ్ఞానికేతిహాసమును పఠించిన ఒక్కొక్క ఆవిష్కారమున కెంతమంది శ్రమపడి, ప్రాణములను ధారపోసినదియు తెలియగలదు.

ఈ ఆత్మవిజ్ఞానము నన్వేషింపబూనిన తతోధికమగు ధైర్యసాహసములును, స్వార్థత్యాగమును, సత్యనిష్ఠయును ప్రయోజనము లగును. ఉపనిషత్తులను పఠించినయెడల గురువులు శిష్యుల నెంతగా పరీక్షించినదియు తెల్లమగును. నాచికేతుడు, సత్యకాముడు, వామదేవుడు, ఇంద్రుడు - వీరెంతగ కష్టించిరి!

సత్యాన్వేషణాపథమున జగత్తును స్వప్నమని విదిలించి పారవేయవలసినయెడల సంకోచ ముండకూడదు. సత్యము ముందర, సుఖము తరువాత.

1935



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty Street, Madras. Editor:—S. Sambhu Prasad.




P.A. రాజు చెట్టియార్ & బ్రదర్

టెలిఫోన్: 218-A జ్యూయలర్సు టెలిగ్రామ్స్: రాజ

కోయంబత్తూరు